# తొలి పలుకు

మహాత్మా గాంధీ ఆశయములకు రూపురేఖలను దిద్ది, నిత్య సత్యవ్రత, సర్వజనశ్రేయోభిలాష జీవితపంథాకు వెలుగు చూపెట్టిన ఉద్గ్రంథాలలో ఈ "అంటు దిస్ లాస్ట్ Unto this Last" అను చిన్న పొత్తము ప్రథమ శ్రేణిలోనిది. దీని రచయిత ఆధ్యాత్మికతత్వవేత్త, విశిష్ట ఆంగ్లరచయిత అయిన శ్రీ జాన్ రస్కిన్.

క్రీస్తు సిద్ధాంతాలను అనుభూతికి తెచ్చుకొన్న ఈ ఆంగ్లభాషా కోవిదుడు ఈ పుస్తకమునకు ఈ పేరును పెట్టుకొనుటకు పురికొల్పినది క్రైస్తవమత గ్రంథమైన బైబిలులోని (మత్తయి సువార్త: 20వ అధ్యాయం, 1-15 సూక్తులు) 'ఈవెన్ అంటు దిస్ లాస్ట్' అను ఉపాఖ్యానము- ఈ కథ సారాంశము "చిట్టచివరి దానికి కూడ" అని మాత్రమే కాదు, అందుకోలేని ఆఖరివానికికూడ అందరితో సమాన ప్రతిపత్తి కలుగజేయుటతోపాటు మున్ముందుగా తరింపజేయుట.

"ఒక సంపన్న భూస్వామి ఉంటాడు; ఆతనికి అనేక ద్రాక్షతోట లున్నాయి. ఒక రోజు ఉదయం కూలివారికొరకు గ్రామంలోని నాలుగు వీధుల కూడలిదగ్గరకు వెళ్ళాడు. అక్కడ కనిపించిన కూలీలతో "పొద్దస్తమానం నా ద్రాక్షతోటలో పనిచేస్తే ఒక పెన్నీ కూలి యిస్తాను. వచ్చి పని చేస్తారా?" అన్నాడు. వారు దానికి అంగీకరించి పనిలోకి వెళ్లారు. ఝాము ఝామునకు ఆ చోటికి వెళ్లి అక్కడ కనిపించిన కూలీలతో "సాయంత్రందాకా పనిచేస్తే కూలియిస్తాను తోటలో పనిచేస్తారా?" అనేవాడు. వారూ దానికి ఒప్పుకొని వెళ్లారు. చిట్టచివరకు సూర్యాస్తమయానికి ఒక గంటముందుగా కూడలిలో కొంత మంది కూలీలు కనిపించారు. "ఏమయ్యా ఊరికే కూర్చున్నారు" అని ప్రశ్నించాడు తోట యజమాని. 'మాకు ఎవరూ పనిచెప్పకపోవడంవల్ల

ఊరికే కూర్చుండిపోయాము' అన్నారు కూలిజనం. 'పొద్దు గుంకేదాకా నా తోటలో పనిచేస్తే ఒగు కూలి యిస్తాను' అని చెప్పి ఆ సంపన్న గృహస్థు వారిని పనిలోకి పంపాడు. పని పూర్తిఅయాక కూలీ లందరినీ, ముందూ వెనుకా వచ్చినవారిని వరుసక్రమంగా నిలబెట్టించి, తన మేనేజరుచేత చివరివానివద్గర మొదలుపెట్టించి మొదటివానివరకూ ఒక్కొక్క పెన్నీ యిప్పించాడు. దానితో ఉదయమే పనిలోకివచ్చిన వారిలో గుసగుసలు బయలుదేరి 'ఉదయము నుండీ ఎండలో చెమటోడ్చి కష్టపడి పనిచేసిన మాతోపాటు ఆఖరుగంటలో పనిలోకి వచ్చిన వారిని సమము చేస్తారా?' అని పేచీలోకి దిగారు. దానితో ఆ భూకామందు కూలీలలో పెద్దను పిలిచి 'నాయనా! నేను మీకు చేసిన అపచారం లేదు. మీ, నా నిర్ణయం ఒక పెన్నీ కూలి; అది మీ కిచ్చివేశాను. ముందుపని దొరకని ఆఖరివారికికూడ మీతోపాటేయిస్తాను. నా సంపత్తును నా యిష్టం వచ్చినట్లు చేయడానికి నాకు అధికారం లేదా? నా సద్భావానికి కళంకం ఆపాదించడం న్యాయమా?' అన్నాడు.

ఇదీ క్రైస్తవమత బైబిలు ఉద్గ్రంథంలోని నీతికథ ప్రబోధం. పరమేశ్వరుని ప్రేమ సామ్రాజ్యంలో అందరూ సమానులు ; పరమేశ్వర సంపత్తి అనుభవమునకు సరిసమాన హక్కు. ఇదే నేటి 'సర్వోదయ' కార్యక్రమమునకు ప్రాతిపదిక. ఈ సర్వోదయం "సర్వేజనా సుఖినో భవంతు" అని మానవశ్రేయస్సు మాత్రమే కోరెడి సూత్రముతో సరిపెట్టుకోలేక దైవాంశ గలిగిన 'లోకాసమస్తా సుఖినోభవంతు' అను హైందవమత జీవితవిధాన నిబంధనకు దగ్గరి చుట్టం. 'భగవద్గీతను మాతగా' జపించి, అనుభూతిని పొంది, హైందవసత్‌సాంప్రదాయాలను పునరుద్ధరించి, భారతీయులను బంధవిముక్తులనుగా జేసిన మహాత్మాగాంధి ఈ పుస్తకములోని విషయమునకు 'సర్వోదయం' అనే మకు

టాన్ని సూచిస్తూ శ్రీ జాన్ రస్కిన్ పెద్ద పుస్తకానికి సంక్షిప్తాను సరణగా ఈ "అంటు దిస్ లాస్ట్" వ్రాశారు. మేము ప్రచురించేది దాని ఆంధ్రానుసరణ. ఆంధ్రజాతిలో సర్వోదయసూత్రభావ ప్రసారానికి ఈ పుస్తకం తోడ్పడగలదని మా ఆకాంక్ష.

ప్ర కా శ కు లు.



# ఆంగ్ల అనువాదకుని విజ్ఞప్తి

తన ఆత్మకథలో ఒక అధ్యాయమునందు (4వ భాగము 18వ అధ్యాయము) 'Magic Spell of a Book' అను శీర్షికలో జోహాన్సు బర్గునుండి డర్బనుకు ప్రయాణము చేయునపుడు 24 గంటలకాలము రస్కిన్ యొక్క "Unto this Last" ఎట్లు చదివినది గాంధీజీ వ్రాసినారు: "బండి సాయంకాలమునకు చేరినది. ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు. ఆ పుస్తకములోని ఆదర్శముల ననుసరించి నా జీవితము మార్చుకొనదలచితిని. "సర్వోదయము" అను పేరుతో దానిని గుజరాతీలోనికి అనువాదము చేసితిని."

"సర్వోదయ" తిరిగి ఇంగ్లీషులోనికి అనువాదము చేయబడినది. రస్కిను యొక్క రసవంతములైన మాటలు సాధ్యమైనంతవరకు యథాతథముగా ఉంచబడినవి.

అధ్యాయము చివర గాంధీజీ యీ పుస్తకములోని బోధనల సారాంశము తాను గ్రహించిన విధముగా వ్రాసినారు.

- ఒక వ్యక్తి యొక్క మంచితనము అందరి మంచితనములో ఇమిడియున్నది.
- అందరకు తమ జీవనోపాధి నార్జించుకొనుటకు సమాన హక్కుగలదు కనుక న్యాయవాది పనికి మంగలివాని పనికి ఒకే విలువ ఉంటుంది.
- పారిశ్రామికుని జీవితము అనగా వ్యవసాయదారుని, చేతి పని చేయువాని జీవితము సార్థకము.

రస్కిను నాలుగు అధ్యాయముల అర్థమునుగూర్చి వ్రాయవసరము లేదు. కాని 1915 లో భారతదేశమునకు తిరిగి వచ్చుటకు చాలకాలము ముందు గాంధీజీ వ్రాసిన ఉపసంహారములో భవిష్యద్వాణి యున్నది; పెన్నిధివలె శాశ్వతముగా భద్రపరచుకొనుటకు తగియున్నది. ఆ పుస్తకములోని తుది పేరా అమూల్యమగు ఆణిముత్యము.

వాల్జీ గోవింద్‌జీ దేశాయ్

# విషయసూచిక :

# సర్వోదయము

## ( UNTO THIS LAST )

"జాన్ రస్కిన్" అనే ఆంగ్లతత్వవేత్త వ్రాసిన గ్రంథానికి గాంధీగారి సంక్షిప్త సారాంశము.

### గాంధీగారి ఉపోద్ఘాతము

పాశ్చాత్య దేశస్థుల మనస్సులలో సాధారణంగా ఉన్న భావమేమంటే, మానవసంఘంలో మెజారిటీ సంఖ్యాకులకు సౌఖ్యం కలుగజేయటమే చాలు అని. దానితో మానవుని కర్తవ్యం తీరిపోయినదే అని వారు భావిస్తారు. సౌఖ్యమంటే భౌతికసౌఖ్యమేఅని, డబ్బుసౌఖ్యమే అని వారి ఉద్దేశ్యం. ఇంకేమీ వారికి అక్కరలేదు. ఈ సౌఖ్యాలను సంపాదించుకోవడంలో నీతిధర్మాలు విచ్ఛిన్నమైపోయినాసరే ఆట్టే ఫరవాలేదని వారంటారు. సాధించవలసినపని బహుసంఖ్యాకులసౌఖ్యమే కనుక, దీనికై ఏకొద్దిమంది సౌఖ్యానో, మేలునో బలిపెట్టినా ఫరవాలేదనియు వారి ఉద్దేశ్యం. ఇట్టి ఊహాలవల్లవచ్చే దుష్ఫలితాలు నేను యూరోప్‌ఖండం మొగంమీద స్పష్టంగా వ్రాసినట్లు కనబడుతునేఉన్నవి.

నీతిధర్మాలను పిరుగత్రొక్కిపారేసి, కేవలం భౌతికమైన, ఆర్థికమైన సౌఖ్యాలకే పోట్లాడే పద్ధతి ఈశ్వరాదేశములకు విరుద్ధమైనది. ఈ సంగతిని పాశ్చాత్యదేశాలలోని బుద్ధిమంతులు కొందరు నిరూపించియేయున్నారు. వారిలో "జాన్‌రస్కిన్" అను వా రొకరు. నీతిధర్మాలకు విధేయులై నడుచుకొన్నప్పుడే మానవులు నిజమైన సౌఖ్యమును పొందగలరని ఆయన తాను రచించిన "అంటు దిస్ ల్యాస్ట్"

( Unto this last ) అనే గ్రంథంలో సహేతుకముగ వాదించి నిరూపించి యున్నాడు.

పాశ్చాత్యపద్ధతులను వేలంవెర్రిగ అనుకరించడానికి ఇండియాలో మనము బాగా అలవాటుపడ్డాము. పాశ్చాత్యులలో ఉన్న మంచి లక్షణాలను అనుసరించడం అవసరమే. కాని, మొత్తంమీద ఆ పాశ్చాత్యపద్ధతులు చెడ్డవని చెప్పడంలో సందేహంలేదు. చెడ్డసంగతులను నిరాకరించాలని అందరూ ఒప్పుకుంటారు కద.

దక్షిణాఫ్రికాలో ఉన్న భారతీయులు ఎంతో దుస్థితికి దిగజారిపోయినారు. డబ్బుసంపాదనకని మనం పరదేశాలకు పోతున్నాము. "త్వరత్వరగా డబ్బు పోగుచేసుకొని, చిటికెలో ఇట్టే భాగ్యవంతులమవుతామనే" తొందరలో నీతి ధర్మాలసంగతి మనము చూడడమే మానివేస్తున్నాము. "మనముచేసే పనులన్నీ భగవంతుడు చూస్తునేవుంటాడు. మనతప్పులకు శిక్షిస్తాడు" అనే మాటే బొత్తుగ మరచిపోతున్నాము. పచ్చిస్వార్థమే మన శక్తులనన్నిటిని దిగమ్రింగివేస్తున్నది. మంచియేదో, చెడుఏదో తెలుసుకునే శక్తియే మనకు క్షీణించిపోయింది. దీనిఫలితమేమిటంటే:-పరదేశాలలో నివసించడంవల్ల మనకు మేలుకలగడానికిబదులుగ, ఎక్కువగ నష్టమే కలుగుతున్నది. అక్కడ ఉన్నందువల్ల మనము పొందదగ్గ పూర్తిలాభాన్ని పొందలేకపోతున్నాము. ప్రపంచంలో ఉన్న అన్నిమతాలలోకూడ ఈ నీతిధర్మమనేది విధాయకమైన అంశముగా ఉండియే యున్నది. సరే, మతములు

చెప్పినమాట యెట్లున్నను మన ఇంగితజ్ఞానమే ఈ సత్యాన్ని మనకు బోధిస్తుంది. అనగా మానవుడైనవాడు నీతిపథాన్ని అనుసరించితీరాలని. ఈ నీతిపథాన్ని అనుసరించడంమూలంగానేతప్ప ఇతరత్రా మానవుడు సౌఖ్యంపొందలేడు. రస్కిన్ మహాశయుడీ సంగతిని ఈదిగువపేజీలలో నిరూపిస్తున్నాడు.

"ప్లేటో" అను గ్రీకుతత్వవేత్త రచించిన "అపాలజీ" అనే గ్రంథాన్ని అనువదిస్తూ "సోక్రటీస్" అను పండితుడు, మానవులమైన మన విధులేమిటో కొంత చెప్పియున్నాడు. చెప్పినప్రకారంగా ఆయన ఆచరించాడుకూడా. రస్కిన్ రచించిన "అంటు దిస్ లాస్ట్" అను ఈ గ్రంథము "సోక్రటీస్" భావాలనే ఉద్ఘోషిస్తున్నదని నేను అనుకుంటున్నాను. ఈ భావాలను ఆచరణలో పెట్టుకోవాలంటే, మానవులు తమ జీవితపు వివిధ రంగములలో నిత్యము ఎలా నడుచుకోవాలో ఈ గ్రంథము చెప్పుచున్నది. నే నీ గ్రంథమునకు ఇప్పుడువ్రాసేది కేవలం తర్జుమాకాదు. సంక్షిప్తానుసరణము మాత్రమే. ముక్కకు ముక్క తర్జుమాచేసిపెట్టితే లాభం లేదు. "అంటు దిస్ లాస్ట్" అనే పుస్తకము పేరుకూడ నేను తర్జుమాచేసిపెట్టడంలేదు. ఆ మాటలలోని భావాన్నిమాత్రం "సర్వోదయం" అనే పదముతో సూచించాను. 'సర్వోదయం' అంటే "అందరికీ మేలు", "అందరికీ సుఖం" అని అర్థం. ఈ గ్రంథాన్ని రచించడంలో రస్కిన్‌గారి అసలు ఉద్దేశమే ఇది. కనుక, దాని పేరు నీరీతిగా 'సర్వోదయం' అనే మాటలతో అనువదించాను.

---

# సర్వోదయము

## ( UNTO THIS LAST )

### మొదటి ప్రకరణము

### సత్యపు నాలపు

భిన్నభిన్న యుగాలలో భిన్నభిన్న భ్రాంతులు మానవ లోకమును పట్టుకొని పీడించియున్నవి. వాటిలో ఒకానొక గొప్పభ్రాంతి, ఈ యుగాన్ని పట్టుకొని పీడించుచున్న దొకటి యున్నది. భ్రాంతులలోని కెల్ల ఇదిమరీ అధ్వాన్న మైనది. అదే నేటి ఆర్థికవిధానము— మానవునకు మానవునకు మధ్య ఉండవలసిన ప్రేమానుబంధములతో సంబంధం ఎంతమాత్రం లేకుండానే పచ్చిస్వార్థంమీదనే మానవులు వాటంవారీగా లాభసాటిగా నడవవచ్చుననే సూత్రమే ఈ ఆధునిక ఆర్థికవిధానములకు పునాదిగా ఉన్నది.

ఇతరభ్రాంతులకు వలెనే ఈ ఆధునిక ఆర్థికవిధానమనే భ్రాంతికికూడ పైకి మెరుగుగా తళుకుగా కనిపించే తర్కబద్ధమైన పునాదిలేకపోలేదు. అయితే వారి తర్కమెట్టిదో చూదాము. వారి తర్కమిది:—

"మానవుని స్వభావములో ఎన్నటికి చెక్కుచెదరక గట్టి పునాదిగ ఉండేది ఆశ, కాంక్ష. ఇంకా ఎక్కువ ఎక్కువగా సంపాందుదాము, ఊరకే పైకిపాకిపోదాము అనేదే. ఇక దయ,

ప్రేమ అనేవి అప్పుడప్పుడు చెదురుమదురుగా ఏదో పొరపాటుననో అన్నట్లు కాస్త తొంగి చూచిపోయేవే. ఆ తొంగిచూసే కాస్సేపులోనైనా మానవునికి అవి సుఖము నివ్వవు. ఉన్న సుఖాన్ని పాడుచేసికూడా పోతూ ఉంటవి. అనవసరముగ మధ్య మధ్య వచ్చి తొంగిచూచి మనసౌఖ్యాన్ని ఊరకే పాడుచేసి పోతూఉండే ఈ దయ ప్రేమ అనే ఈ దిక్కుమాలిన వాటిని పూర్తిగ తొలగించి వేసుకుందాము పట్టండి. మనిషి అంటే కేవలం డబ్బుపోగుచేసుకునే యంత్రం. కనుక పనిచేసేకూలీలకు ఎంతడబ్బుయిస్తే, క్రయవిక్రయాలు సరిగాజరుపుతుంటే, డబ్బు ఊరకే తేలికగ గుట్టలుగా మానవులు పోగుచేసుకోడానికి ఏవో ఆ సూత్రాలు ఆలోచిద్దాము పట్టండి. ఈ సూత్రాలు గట్టిగ ఒకసారి నిర్ణయించుకొని కుదిచేసుకున్నతరువాత ఇక ఆ యా వ్యక్తులు ఎవరైనా తమకు కావాలంటే, తమఇష్టం వచ్చినంత "దయ" "ప్రేమ" అనే చలచిత్తపు వికారాలు చూపించుకుంటే చూపించుకోవచ్చుగాక"

ఈ తర్కములో ఒకలోపం ఉన్నది. అదేదో చూద్దాము. రెండువస్తువులను ఇక్కడ పరీక్షకుపెట్టారు. ఒకటి గట్టిది, చెక్కుచెదరనిది; ఇంకొకటి తేలికది, చెదురుమదురుగవచ్చిపోతూ ఉండేది. ఈరెండువస్తువులు మూలతత్వంలో ఒకే స్వభావము గలిగినవైయుంటే వారుచెప్పిన తర్కం వర్తించేమాట నిజమే. ఒకగట్టివస్తువు పెద్దఇనుపగుండు ఒక వడితో రోడ్డువెంట పోతూ ఉందనుకోండి. ప్రక్కకు మనం నుంచుని మధ్యమధ్య అప్పుడప్పుడు దానిమీద ఒకఇనుపగూటంతో దెబ్బలు కొడుతూ

ఊంటూనునుకొంటే. ఇట్టిస్థితిలో ఆ ఇనుపగుండు ఏప్రక్కకు, ఎంత వేగముతోపోతుందో దానియొక్కయు, ఆగూటముయొక్కయు బరువును. వడినిబట్టి లెక్కకట్టవచ్చును. ఇది సులభము, సాధ్యము అయినపనే. ఎందుకంటే ఈరెండు పదార్థములుఇనుపవే. రెండూ వస్తుతః ఒకేస్వభావముకలవే కనుక. కాని మానవులు ఇనుము వంటి జడపదార్థములుకారు. వారియందు గట్టిగ శాశ్వతంగా ఉండేటువంటి గుణములు, మనస్సమాస్య నాడిపైకి వచ్చినప్పుడుండేసంగ తులు స్వాభావికంగా ఒకేస్వభావముకలవికావు. ఈ క్రొత్తసంగతులు వచ్చి మీదపడగానే అసలు మూలగుణములలోనే తాత్త్విక మార్పు వచ్చేస్తుంది. ఈ మార్పు భౌతికంగా గణితం ప్రకారం కాక, రసాయనికమైన మార్పే వచ్చేస్తుంది. మొదటిదానికి భిన్నంగా దాని లక్షణాలు గుర్తుపట్టడానికి వీలులేనిరీతిగా మారిపోతుంది. దానిని గురించి మనకున్న పూర్వజ్ఞానమంతా ఇప్పుడు మనకు దమ్మిడీకి పనికిరాకుండా పోతుంది.

భౌతికశాస్త్రమున్నది. అసలు దానిపునాదే సరియైనదా కాదా అని సందేహం. ఈ పునాది సరియైతే, తక్కినసంగతులు ఒప్పుకోడానికి నాకు అభ్యంతరంలేదు. నాకు కావలసినదిపునాది సంగతేకాని తక్కినవి నాకు అప్రధానమైనవి. నాకు వాటిని గురించి అంతపట్టింపులేదు. మనుష్యులకు ఎముకలే లేవని ఒప్పు కుంటే, తక్కిన కసరత్ సంగతులన్నీ ఒప్పుకోవడానికేమి అభ్యం తరం! మనిషికి ఎముకలే లేవని ఒప్పుకుంటే, ఇక మనిషిని చాప చుట్టినట్లు చుట్టవచ్చు. కాగితపుబంతిలాగ నలిపివేయవచ్చును. అప్పడములాగ అప్పడాలకర్రతో వత్తివేయవచ్చును. సన్నగ.

తీగెలాగ కమ్మిచ్చులోనుంచి నాగదీయవచ్చును. ఇంతపనిచేసిన తరువాత, దానిలో మరల ఎముకలుదూర్చి మనిషి బొమ్మగ చేసి నిలబెట్టడం కష్టమనికూడ వేరే చెప్పనక్కరలేదు. ఈ కార్యకారణ హేతుపరంపర అంతా సరిగ్గానే ఉందని ఒప్పుకుంటాం. అయితే ఈ తార్కపరంపరకంతాకూ మూలమైన అసలుసంగతి అనగ (మనిషికి ఎముకలులేవనే సంగతి) నిజమా అని? ఇదే సందేహం! ఇది నిజంకాకపోతే, తరువాతవచ్చే ఈ తర్కపరంపరంతా వ్యర్థమే కదా. ఇట్టితర్కము క్రియలో ఏమి ప్రయోజనం! ఎముకఉన్న మానవశరీరానికి ఈ తర్కము ఈ వాదము ఎలా వర్తిస్తుంది? ఆధునిక అర్థికశాస్త్రమంతా సరిగ్గా పునాదిలేని ఈ తర్కపరంపర మాదిరిగానే ఉన్నది. మనిషికి శరీరమే ఉన్నదికాని, ఆత్మలేదని ఈ అర్థికశాస్త్రము తలచుచున్నది. అందుకని ఆత్మఅనేదాని ఆలోచనే వీరి లెక్కలలోకి రాదు. ఈ లెక్కలేకుండానే, వీరు బ్రహ్మాండమైన అర్థికశాస్త్రమును నిర్మించుకొన్నారు. కనుక, ఈశాస్త్రపు ప్రకరణాలన్నీ ఆత్మ ఉన్నదనే మనిషికి ఎలా వర్తిస్తవి? మనిషికి ప్రధానంగా ఉన్నదల్లా ఆత్మయే అయినప్పుడు, వీరి అర్థికశాస్త్ర సూత్రాలన్నీ — వీరితర్కపరంపరలన్నీ — దమ్మిడీకి కొరగాకుండపోతవి. పోతున్నవి.

కనుక, వీరి అర్థికశాస్త్రము, ఒకసవ్యమైన శాస్త్రమే కాదు. క్రియవచ్చేటప్పటికి ఇది దమ్మిడీకి కొరగాక, తెల్లమొగం వేస్తోంది. ఉదాహరణచూడండి. కూలీలు సమ్మెకట్టినప్పుడు ఈశాస్త్రంయొక్క బండారం బయటపడడంలేదా?

మిల్లుయజమానులు ఒకదృష్టిలో ఉంటారు; కూలీలు మరొక భిన్నమైన దృష్టిలో ఉంటారు. అప్పుడు పై రీతిని తయారైన ఏఆర్థికశాస్త్రంగానివచ్చి ఈ ఉభయపక్షాలను సరిదిద్ది ఏక మొనర్పలేక పోతున్నది. "యజమాని ప్రయోజనం ( Interest ) కూలివాని ప్రయోజనం ఒక్కటే, అవి పరస్పరవిరుద్ధమైనవి కావని" శాస్త్రపండితులంతా వచ్చి ఋజువుచెయ్యడానికి పూనుకుంటారు. కనుక ఇరుపక్షములు తగాదాపడవద్దని ఎన్నెన్నో చెబుతారు. నిజమే, అంత మాత్రమే కాదు. అంతకంటే ఎక్కువైన సంగతే మరొకటి నేను చెబుతాను. ఒకవేళ, ఇరువురువ్యక్తుల ప్రయోజనాలు భిన్నమైనవే అనుకుందాము. అయినప్పటికి విరోధపడ వలసినపని లేదే! ఉదాహరణచూడండి:—ఇంట్లో తినడానికి ఒకరొట్టె ఉన్నది. తల్లిఉంది. పిల్లలున్నారు. అందరూ ఆక లితో మాడుతున్నారు. అప్పుడు అందరిప్రయోజనాలు ఒక్క టేనా? కావు. ఎందుకంటే, రొట్టెనంతా తల్లితినేస్తే పిల్లలు మాడతారు. పిల్లల ప్రయోజనం భగ్నమైపోతుంది. పిల్లలు తినేస్తే తల్లిఆకలితో మాడుతుంది.అనగా తల్లి ప్రయోజనం భగ్నమైపోతుంది. ఈ రీతిగా తల్లి ప్రయోజనం, పిల్లల ప్రయోజనం భిన్నభిన్నమైనవిగా ఉన్నవి. అయినప్పటికి ఈ ఇరుపక్షాలకు విరోధముఉంటుందా? ఈ విరోధంవల్ల ఇరు పక్షాలుదెబ్బ లాడుకుంటారా? ఈ దెబ్బలాటలో పిల్లలకంటే తల్లియే బలవంతమైనదికనుక రొట్టె తానే తినేసి కూర్చుం టుందా? ఇట్లే ఇతర సందర్భాలుకూడా మనం ఆలోచిం చాలి. ఇరువురిమధ్య ప్రయోజనాలు భిన్నమైనప్పటికి న త్వా-

రణంగా ఒకరితో ఒకరు దెబ్బలాడుకోవలెనా? దౌర్జన్యమో మోసమో ఉపయోగించి, ఒకణ్ని క్రిందికి తోసివేసి రెండో వాడు తానే లాభంపొందవలెనా ?

"పందులకు ఎలుకలకు ఎట్టి కోరికలు ఆశలు వుంటవో వాటికంటె ఉన్నతమైన నీతియుక్తమైన ఆశయములు మానవులకు లేవు" అని ఒకవేళ మనం అనుకున్నప్పటికీ యజమానికి కూలీకి మధ్యనున్న ప్రయోజనాలు కేవలం భిన్నమయిన వని కాని, లేక అభిన్నమయినవని కాని ఏకాఎకిని నిర్ణయించి పారవేయటానికి వీలుకాదు. ఎందుకంటే, సందర్భాసందర్భములనుబట్టి, అవి భిన్నమైనవీ కావచ్చు, అభిన్నమైనవీ కావచ్చును. "పనిసరిగ్గా జరగాలి, తయారైవస్తువుకు ధర బాగా రావాలి," అనేవిషయంలో ఇరువురిప్రయోజనం ఒకటే, అభిన్నమైనదే. ఇక్కడ తేడా లేదు. కాని, లాభాలుపంచుకునే సందర్భం వచ్చినప్పుడుమాత్రం ఒకని ప్రయోజనం ఇంకొకని ప్రయోజనానికి భిన్నమైపోతున్నది. ఇక్కడ ఇరువురి ప్రయోజనాలు భిన్నమైనవై పోతున్నవి. ఒకనిలాభం, ఇంకొకనికి నష్టముగా తయారవుతున్నది. ఇంకొకదృష్టితో చూద్దాం. కూలీలు రోగిష్టులై అశక్తులై దగాలుపడికుంటుచేటంత హీనంగా చాలా తక్కువకూలి ఇచ్చిపనిచేయించుకోవటం యజమానికిని ప్రయోజనంకాదు. అట్లే, లాభాలు చాలతక్కువ వచ్చి యజమాని అసలుపనినే భద్రంగా ధారాళంగా సాగించలేనంత హీనస్థితికి తెచ్చేపద్ధతిగాతమకు విపరీతపు

హెచ్చుకూలీ కావాలని కూలీలు పట్టుపట్టికూర్చోవడం కూలీలకు ప్రయోజనం కాదు. ఇంజన్ చక్రాలే మరమ్మతు చేయించుకోడానికి డబ్బులేక కంపెనీ అఘోరిస్తూఉంటే, ఇంజన్‌లో బొగ్గువేసేకూలీ తనకు హెచ్చుజీతం కావాలని కూర్చుంటే ఏమిప్రయోజనం !

"ఎవరికి సందు చిక్కినప్పుడు వారు ఎదుటవానిని నొక్కి బలవంతంగా తమతమ స్వప్రయోజనాలు సాధించుకుందా"మనేపద్ధతి నిష్ప్రయోజనమైనపద్ధతి. దీనిమీద ఆధారపడిచేసే మానవ సంఘసూత్రాలు దండుగమారిసూత్రాలు. అట్టివి దండగైపోవాలనే ఈశ్వరేచ్ఛ. మానవుని ప్రవర్తన ఇట్టి వాటంవారీ బలాత్కారపు పద్ధతులమీద కాక, న్యాయసూత్రాలమీద నడవాలనిచేసే ఈశ్వరేచ్ఛ. అందుకనే భగవంతుడు ఇట్టి వాటంవారీబలాత్కారపుపద్ధతులు నిష్ప్రయోజనమైపోయేటట్లు చేస్తూ ఉంటాడు. మానవుడు చేసే కర్మను (పనికి)ఫలితము మానవుని చేతిలోలేదు. ఆ కర్మయొక్క ఫలం కొరకు తనకెట్లు పరిణమిస్తుందో ఇతరులకెట్లు పరిణమిస్తుందో మానవుడు తెలుసుకోలేకపోవచ్చుగాక. అయితే, మానవుడు తెలుసుకోగలిగినది, తెలిసికోవలసినది, ముఖ్యంగాఒకటిఉన్నది. అంటే – ఏదిన్యాయమో, ఏదిఅన్యాయమో అనే సంగతి మాత్రం ప్రతివాడు తెలుసుకోగలడు; తెలుసుకోవాలి. బహుమందికి తెలుసుకూడా. ఇక, అందరికి తప్పక తెలిసియున్న సంగతి ఇంకొకటికూడాఉన్నది.అనగా న్యాయప్రవర్తనయొక్క ఫలితం కొరకు తమకు తదితరులకుకూడా అత్యుత్తమమైనది

గానే పరిణమించి తీరుతుందన్నది కూడా అందరికి తెలిసిన విషయమే. అయితే ఆ "అత్యుత్తమమైనది" అనేది సరిగ్గా ఏదో, అది ఎలా ఉంటుందో, అది ఎలా వస్తుందో - మనము చెప్పలేకపోవచ్చుగాక.

"న్యాయము" అనే పదంలో "ప్రేమ" అనేభావం కూడా ఇమిడియున్నదనే నా ఉద్దేశ్యం. ఒకమనిషి ఇంకొక మనిషికి విధిగ చూపవలసిన ప్రేమఇది. ఇది ప్రతిమానవుని కర్తవ్యము: అంటే ఒకమనిషి ఇంకొకమనిషికి ప్రేమ అనే ధనమును బాకీపడియున్నాడు. ఋణపడి యున్నాడన్నమాట. మనిషి పుట్టడమే * ఈఋణంతో పుట్టాడు. యజమానికి కూలీకి మధ్య ఉండవలసిన సంబంధంకూడ కొరకు సత్యమైన ఈ ప్రేమానుబంధంమీదనే ఆధారపడియున్నది.

నిత్యం మనఇంట్లో చాకిరిచేసే నౌకరు సంగతే ఉదాహరణగా తీసుకొని చూద్దాము.

తానిచ్చేజీతానికి ఎంతఎక్కువపని నౌకరుచేత చేయించుకోడానికి అవకాశం ఉంటుందో అంతపని చేయించుకోడానికి యజమాని కేవలం చూస్తాడనుకొందము. ఒక్కక్షణంకూడ వాడికి ఊపిరిఆడనీయకుండ పూరాగా చేయించుకుంటాడు. ఎంతహీనంగా వాడికి కూడుపడెయ్యాలో అంతహీనంగా పడేస్తాడు. ఎంత అధ్వాన్నపుగుడిసెలో వాణ్ణి పెట్టాలో అంత

---

* మాతృ, పితృ, దేవ, మనుష్య ఋణములు -ఇత్యాది ఋణముల

అధ్వాన్నపు గుడిసెలో వాణ్ణి ఉంచుతాడు. "ఇది రైటే, న్యాయమే -దీనిలో తప్పేముంది" అని సామాన్యంగా అందరూ అనుకుంటారు; ఎందుకంటే, "ఈపద్ధతికి ఒప్పుకునేకద వాడు నౌకరీలో చేరాడు! వాస్తవరైనా బలవంతంచేశారా? మట్టి ప్రక్కల ఇళ్ళల్లో ఇంతకంటె వీడిమొగాన ఎక్కువబోర్లిస్తారా? ఎవరైనా అట్లా బోర్లిస్తే పొమ్మను. నేను వీణ్ణి ఏమైనా నా ఇంట్లో కట్టిపడవేశానా, పొమ్మను. నాఅభ్యంతరంలేదు" అని అంటున్నాను.

ఇదీ, నేటి ఆర్థికశాస్త్రవేత్తలు చెప్పే లోకరీతి. ఈ శాస్త్రవేత్తలు ఏమంటున్నారంటే; "ఈ పద్ధతివల్ల నౌకరు నుండి సగటున చాలా హెచ్చుపని గుంజుకోవచ్చును. కనుక యావత్తు సంఘానికీకూడ దీనివల్ల చాలా హెచ్చుమేలు కలుగుతుంది. తద్వారా, ఆ నౌకరుకుకూడా హెచ్చు మేలే కలుగుతుంది."

కాని, నిజమాలోచిస్తే, జరిగేది ఇదికాదు. మనిషి బొగ్గు నిప్పు, నీరు వంటివాటిచేత నడిచే (Engine) ఇంజనే అయితే ఈ లెక్కసరిపోతుంది. ఎందుకంటే ఇంతబొగ్గువేస్తే, ఇన్నినీళ్ళుపోస్తే, ఇంతవేడిచేస్తే, ఇంత ఆవిరి పుట్టి, ఇంత బరువును ఇంజన్ లాగుతుంది అని మనము లెక్క కట్టవచ్చును. కాని మనిషి బొగ్గు, నిప్పు, నీరు చేత నడిచే ఇంజన్‌కాదు. ఇదొక వింతయైన ఇంజన్. దీనిని నడిపించేది దానిలో ఉన్న ఆత్మశక్తిగాని మామూలు బొగ్గు నిప్పు

నీళ్ళ శక్తి కాదు. మన ఆర్థికశాస్త్రవేత్తల లెక్కలలోకి ఈ ఆత్మశక్తి అనేది వారికి తెలియకుండా ప్రవేశించి, వారి లెక్కలన్నింటిని తల్లక్రిందులు చేసివేస్తుంది. ఇదొక వింత ఇంజన్ అని చెప్పాను. ఇది జీతానికి పనిచేయదు. ఒత్తిడికి లొంగి పని చేయదు. ఎంతఎక్కువజీతమిస్తే, ఎంతఎక్కువ వత్తిడిపెడితే అంత ఎక్కువ పని చేసే ఇంజనునూ కాదిది. దానిని నడిపించే ఆత్మశక్తికి, లేక ఇచ్ఛాశక్తికి, బొగ్గువెయ్యాలి. ప్రేమయే ఈబొగ్గు. ఈబొగ్గు ఎంతఎక్కువేస్తే అది అంత ఎక్కువ శక్తివంతమైన పని చేస్తుంది.

యజమాని బుద్ధిమంతుడై, దిట్టమైన వాడైతే వత్తిడి పెట్టి తన నౌకరునుండి ఎక్కువపని చేయించుకోవడం తరుచు చూస్తూఉంటాము. ఇక, యజమాని నిర్లక్ష్యంగా ఉండి దుర్బలుడైతే నౌకరువల్ల తక్కువపనే చేయించుకోవడం, అదినీ అధ్వాన్నపుపనిగా ఉండడం కూడ మనం తరచు చూస్తూ ఉంటాము. ఇట్టివిషయాలలో సర్వత్రవర్తించే సూత్రమొకటి ఉన్నది. యజమానిలో నౌకరులోకూడా, ఏదోకొంత బుద్ధి, శక్తి అనేవి ఉన్నవని అనుకుందాము. అయినప్పటికీ, వీరికి కొసకు కలిగే గరిష్ఠ భౌతికఫలితం ఏరీతిగా కలుగుతుందంటే ఒకరికొకరు విరోధపడటంవల్ల కాదు ; ఒకరియెడల ఒకరు సద్భావము ప్రేమ కలిగియుండడంవలననే కలుగుతుంది.

ఇందులో ఇంకొకరహస్యంకూడా ఉన్నది. యజమాని అతిమెత్తగాచనువుగఉంటే, నౌకరుసాధారణంగా ఎగస్వాము?

పెడతాడు. దయచూపితే అదిమరచిపోయి కృతఘ్నుడవుతాడు. కఠినంగాఉంటే కసితీర్చుకోవాలని చూస్తాడు. విశాల హృదయంతో ఉన్న యజమానియెడల నీచంగా ప్రవర్తించిన నౌకరు అన్యాయంగాఉన్న యజమానికి హానికరుడౌతాడు.

ఎట్టిపరిస్థితుల్లోకాని ఎట్టిమనిషి ఎడలకాని నిస్వార్థతతో దయ, ప్రేమ చూపించి ప్రవర్తిస్తే మిక్కిలి ప్రశస్తమైన ఫలితాలుకలుగుతవి. దయ ప్రేమ అనేవి వస్తుతః మంచివా? వాంఛనీయమైనవా? గొప్పవా? అనేదృష్టితో నేనిప్పుడు మాట్లాడడంలేదు. అవి మనుష్యులను నడిపించే శక్తులుగ ఎంతవరకు పనికివస్తవి? అనే సంగతినే దృష్టిలోపెట్టుకొని నే నిప్పుడు మాట్లాడుతున్నాను. అవి ఒకరకం అతీతమైనశక్తులనీన్నీ, అవి వచ్చి మన ఆధునిక ఆర్థికవేత్తలు మామూలుగా వేసే లెక్కలనన్నిటిని ఒక్కతన్నుతన్ని పడగొట్టిపోతూ ఉంటవనీన్నీ మాత్రమే నే నిక్కడ చెప్పదలచుకున్న సంగతి. దయ, ప్రేమ అనే ఈశక్తులలోకూడ ఇంకొక తమాషాగుణంఉంది. అవి మనుష్యులను సవ్యంగా నడిపించే రీతిగానే పనిచెయ్యాలంటే, వాటికి పొరుగుగిట్టదు. అంటే, ఇంకొక ఇంకొక శక్తులతో పరిస్థితులతో వాటిని జతచేయడానికి వీలులేదు. అలా జతచేస్తే అవి సవ్యంగా పనిచెయ్యవు. ఎట్లో చూడండి. "నేను చూపే దయకు నా నౌకరు తిరిగి ప్రతిఫలంగా నాయెడల కృతజ్ఞత చూపించాలి" అనే ఉద్దేశ్యంతో నేను నా నౌకరును దయతో చూస్తాననుకోండి - అప్పుడా దయ దండుగై పోతుంది. అది పనిచెయ్యదు. ఎందుకంటె దానిని నేను "కృతజ్ఞత" అనే

ప్రతిఫలాపేక్షతో జతచేశా గనుక." ప్రతిఫలం రాకపోగా ఎదురుకూడా నన్ను నౌకరు తన్నవచ్చు. నా నా తన్నులు తగలవలసిందేకూడ. ఇక అట్లుకాక, ఏవిధమైన ఆర్థికపు ప్రతిఫలాపేక్షతో జతపరుపకుండ, నేను నా నౌకరుయెడల దయగ ప్రేమగా ప్రవర్తిస్తాననుకో, అప్పుడు ఆ దయ, ప్రేమ అనే శక్తులు చక్కగ పనిచేస్తవి. అన్ని ఆర్థికప్రయోజనాలు నీకు లభింపజేస్తవి. ఏసుక్రీస్తు చెప్పినట్లు, ఈవిషయాలలోకూడ, తనప్రాణాలు కాపాడుకోవాలనుకున్నవాడు పోగొట్టుకుంటాడు; పోతే పోయిననుకున్నవాడు కాపాడుకో గలుగుతాడు.

యజమానికి, కూలీకి మధ్య ఉండదగిన సంబంధమును నిరూపించుటకు, ఇంకొక ఉదాహరణ చెబుతాను. ఓడ యజమానికి, ఓడనడిపే మనుష్యులకు మధ్యగల సంబంధం చూడండి :—

ఒక ఆఫీసరు తనక్రిందిసిబ్బంది చేత అత్యధికమైన పని చేయించడానికిగాను - తనకు ఈషన్మాత్రమైనను శ్రమలేకుండ - కేవలం రూల్సునే అమలుజరుపబూనినా డనుకొందము. ఇట్టిప్రతిఫలాకాంక్ష సిద్ధాంతంమీద పనిచేస్తే, ఎన్ని క్రమశిక్షణరూల్సు అమలుజరిపినా, ఆతడు తనసిబ్బందివల్ల పూర్తిపనిని తీసుకోలేడు. అట్లుకాక, తనసిబ్బందితో అత్యంత సన్నిహితస్నేహభావముకలిగి, వారి యోగక్షేమములయందు అత్యంతశ్రద్ధకలిగి, వారి జీవితములను అత్యంతమైన విలువతో చూచుచుండిన యెడల, వారి శక్తిని, కౌశలములను, అత్యంత

సమర్థవంతముగా, పటిష్టముగ, సంపాదించగలడు. వారికి తనయెడల ఉద్భవించిన సద్భావప్రేమలవల్లనున్ను-తన ప్రవర్తనయెడల వారికి చిక్కిన విశ్వాసమువల్లనున్ను - వారియొక్క శక్తికౌశలములను - ఏఇతరవిధములచేతను అందుకొనజాలనంత మహోన్నతస్థితికి కొంపోగలడు. సిబ్బందిసంఖ్య హెచ్చయిన సందర్భములలో ఈ సత్యము మరీ బాగా వర్తిస్తుంది. సైన్యపతిమీద సైనికులకు ఇష్టములేకపోయినా, ఒకానొక కోటముట్టడి తరుచు జయప్రదంగా జరిగితే జరుగవచ్చుకాక. కాని, మొత్తంమీద యుద్ధంమాత్రం సైనికులకు తమసేనాపతిమీద ప్రేమలేకపోతే విజయవంతంకావడం బహుఅరుదు.

దాదాపోపిడిగాండ్రముఠాలలో, ఒకరియెడల ఒకరు పూర్తిగ ప్రేమాభిమానాలుకలిగి ఉంటారు. తమనాయకుని కొరకై వారిలో ప్రతిఒకడు తనప్రాణాలు బలిఇవ్వడానికి సిద్ధపడతాడు. కాని, మామూలుగా వస్తూత్పత్తిచేసే మిల్లులు వగైరాలలో పనిచేసే కూలీలకు, మిల్లుయజమానికి మధ్య మాత్రం ఇట్టిప్రేమాభిమానబంధాలు సాధారణంగా ఉండవు. తన మిల్లుయజమాని నిమిత్తమై తన ప్రాణం ఇవ్వడానికి ఏ మిల్లుకూలియు సిద్ధపడడు - ఇష్టపడడు. ఎందుకంటె, ఇట్టి మిల్లుకూలీపనికి స్థిరత్వంలేదు. అంటే, వ్యాపారపువత్తిడినిపట్టి వానికి ఈరోజు కూలిఉండవచ్చు; రేపు "నాకుఅక్కరలేదు పొమ్మని" యజమాని వానిని వెళ్ళగొట్టవచ్చును. అట్లే వానికి ఇచ్చే కూలి, వ్యాపారపువత్తిడినిపట్టి ఇవ్వాళ్ళ హెచ్చు

ఇవ్వవచ్చును; రేపు తగ్గించివేయవచ్చును! కనుక, వాని బ్రతుకుకు స్థిరత్వంలేదు. ఇంతకాలం తప్పకుండ ఉంచుకుంటాను, ఇంతకూలి తప్పకుండ ఇస్తాను అనే నిశ్చయం సేనలోని సిపాయిలకు, తదితరనౌకర్లకు ఉంటే ఉండవచ్చును కాని, మిల్లుకూలీలకు ఆపాటికూడా లేదు. వారిబ్రతుకు దినదినగండమే. ఇట్టిస్థితిలో మిల్లుయజమాని యెడల కూలికి ప్రేమాభిమానాలు ఎలా ఉంటవి? ఒక్కొసారిగా విద్వేషవిషభాండము బ్రద్దలవనచ్చుకూడా. కనుక, ఈ సందర్భంలో రెండు సంగతులు మన ఆలోచనలోనికి రావలసియున్నవి.

(1) పనివత్తిడి, మనిషివత్తిడి ఉన్నా లేకపోయినా, కూలివానికూలిలో మార్పులేకుండ, స్థిరంగా ఎంతవరకు నిలుపవచ్చును?

(2) వ్యాపారపరిస్థితులు అనుకూలంగా ఉన్నా లేకపోయినా కూలీలమఠాలను, అట్టిస్థిరమైన కూలీఇచ్చే పద్ధతితో, వారిసంఖ్యను హెచ్చించడంకాని తగ్గించడంగాని లేకుండ, అట్టిపెట్టుకొని, పోషిస్తూ ఉండడం ఎంతవరకుసాధ్యము? తద్వారా, మిల్లులలో ఈకూలిముఠాలకుకూడ శాశ్వతమైన ప్రయోజనం స్థిరపడేటట్లున్న చేయడంఎలా? పూర్వకాలంలో సంపన్నగృహస్థులఇండ్లలో నౌకర్లస్థితి ఇట్టిస్థిరత్వమునే కలిగియుండెడిది. దేశాలులూటీచేసి, లూటీపంచుకోడానికి బయలుదేరే దండయాత్రలలోని సైనికులస్థితికూడఇట్లే

(3)

ఉండేది - అంటే దండయాత్రప్రయోజనంలో వారికి కూడ స్థిరమైన వాటా ఉండేది. అందువల్ల, వారికి దండయాత్రఅంటే ఉత్సాహం అభిమానం ఉండేది.

(1) మానవలోకం తరుచు వింతగా పడుతూఉండే పొరపాటు ఒకటి ఉన్నది. అదేమంటే, "పనిగిరాకీఉన్నా లేకపోయినా సరే, కూనివానికిచ్చే కూలి తగ్గించరాదు" అనే సూత్రాన్ని నేటిఆర్థికవేత్తలు అంగీకరించకపోవడమే ఈవింత.

మన దేశానికి ప్రధానమంత్రిని నియమించుకోవడంలో, "ఎవరు తక్కువ జీతానికి చేస్తామంటే వారి కీ ఉద్యోగం ఇస్తామని" వేలంపాట పెడతామా? మనకు జబ్బుచేస్తే, "ఎవరుతక్కువఫీజుపుచ్చుకుంటే, ఆ డాక్టరును పిలుద్దామని" కూర్చుంటామా? వ్యాజ్యంవస్తే, ఫీజుతక్కువ పుచ్చుకునే ప్లీడరుకోసం బేరాలాడుతామా? మధ్యత్రోవలో తుపాను వానలో చిక్కుకున్నప్పుడు, బేడకువస్తావా అణాకువస్తావా అంటూ రిక్షావాడితో బేరాలాడుతూ నిలబడతామా?

అత్యవసరము, అత్యుత్తమమునైన పనికి, శ్రమకు, మనం ఎల్లప్పుడు బేరం ఆడకుండ ప్రతిఫలం, కూలి, ఇస్తునే ఉన్నాము; ఇట్లే అన్నిరకముల పనులకుకూడ బేరం ఆడకుండ, మార్పులేకుండ ఒకే పరిమాణంలో ప్రతిఫలం (కూలి) ఇవ్వాలి. ఇదిన్యాయం. ఇది సవ్యమైనపద్ధతి.

"ఆం ఏమిటీ మంచిగాచేసిన పనివానికి, చెడుగాచేసిన పనివానికికూడా సమానమైన కూలిఇవ్వడమా!" అని, లోకం ఆశ్చర్యంతో నిర్ఘాంతపోవచ్చుకాక!

"తప్పకుండ, అలా ఇవ్వవలసిందే" అంటాను నేను. దీనిలో ఆశ్చర్యమేమున్నది! నీకు మతబోధచేయించుకోడానికై పిలిచే గురువుకు-మంత్రాలు సరిగ్గావచ్చినవాడైనాసరే, రానివాడైనాసరే- దక్షిణ సంతోషంతో సమముగా ఇస్తున్నావా లేదా? (ఇతడూ పనివాడే, అంటే నీ ఆత్మమీద పని చేసే కూలివాడే కదా.)- అల్లే, నీకు వైద్యం చేయించుకోడానికై పిలిచే డాక్టరుకు - అతడు మంచిడాక్టరైనా కాక పోయినా - ఫీజుసమానంగానే ఇస్తున్నావుకద ఇతడూ పని వాడే-) అంటే నీ భౌతికశరీరముమీద పనిచేసే కూలివాడు అన్నమాట) అల్లే, నీ ఇల్లు కట్టడానికి నీవు పిలిచే టాపీపని వానికికూడ - వాడు బాగాపనిచేతయినవాడు అయినా కాక పోయినా - కూలి సంతోషంతో సమానంగానే ఇవ్వవలసిన దని చెబుతాను.

అయితే, నీవు నాకు ఒక జబాబు చెప్పవచ్చును. "అసలు నేను డాక్టరును పిలిచేటప్పుడే, మంచివాణ్ణే ఏరుకొని పిలుస్తాను- పనిలోని మెరుగు తరుగులగురించిన జ్ఞానం నాకున్నదని దానివల్ల నిరూపించుకుంటాను" అని నీవు జవాబు చెప్పుదువు కాబోలు. "రైట్; దీనికి నేను ఒప్పుకుంటా; ఉన్న తాపీపనివాళ్ళల్లో మంచివాడెవడో చూచి ఏరుకో; దానికి అభ్యంతరంలేదు. అంటే, దానివల్ల ఏమిసారాంశము తేలుచున్నది? మంచిపనివానికి లభించే ప్రతిఫలం ఏమిటన్నమాట- "మా ఇంటికి రా, మాఇంటికిరా" అని ప్రతిగృహస్థుచేత పిలి

పించుకోవడమే! మంచివానికి పనిదొరుకుతుంది, చెడ్డవానికి దొరకదు; ఇద్దరికి తేడా ఇందులో ఉన్నదేకాని – పిలిచిన తరువాత ఇచ్చే కూలిలో లేదు.

పనికి పిలిచినతరువాత, పనిచేతనైనవానికి, చేతకాని వానికి కూలి సమముగా ఇవ్వవలసిందే. ఇదే ఈసమస్యకు సవ్యమైన పరిష్కారమార్గము. ఇదికాక, అపసవ్యమైన పద్ధతి ఒకటి ఉన్నది. అదేమంటే:– 'చేతకాని పనివాడొకడు వచ్చి నేను సగంకూలీకే చేస్తానంటే, వాణ్ణి పెట్టుకోవడం. ఇదొక అపసవ్యమైన పద్ధతి. తద్వారా, మంచిపనివాడుకూడ బలాత్కారంగా విధిలేక, తక్కువకూలీకే ఒప్పుకొని పనిచేసేటట్లు చేయడం. అట్లు తక్కువకూలీ పడడానికి మంచిపనివాడు అంగీకరించకపోతే, వాడికిఅసలే పనిదొరకక మాడడం, అట్టివాళ్లంతా వెనుకకు పోవడం, తుదకు పనికి మిగిలేవాళ్ళంతా దనాసరి రకంవాళ్లే అవటం! పనులుపాడవటం!

(2) కూలీల కిచ్చే కూలీలో సమానత్వం సాధించడమనే సమస్య మన సమస్యలలో మొట్టమొదటిది. దీనికి మార్గమేదో మనం చూడవలసియున్నది. ఇదికాక, రెండవసమస్య ఇంకొకటి ఉన్నది. తత్కాలకపు పనివత్తిడి ఉన్నాలేకపోయినా, కూలీల సంఖ్యను తగ్గించకుండా, వారిని ఎల్లప్పుడూ అదే సంఖ్యలో పనిలో ఉంచవలసినదే అనేది ఈ రెండవసమస్య. దీనికి కూడమనం పరిష్కారమార్గం ఆలోచించాలి.

మధ్యమధ్య పనిలోనుండి తీసివేయకుండా నిరంతరంగా పొడుగునా, అన్నిరోజులు, పనిలో ఉంచేపక్షంలో, కూలి వాడు తక్కువకూలీరేటుతోనే సంసారం గడుపుకోగలడు అట్లుకాక, మధ్యమధ్య తీసివేసేస్థితి ఉంటే, వానికి కూలి హెచ్చుఇస్తేకాని గడవదు. నిరంతరం పనిలో ఉంచితే వానికి తక్కువ రేటుతో జీతమనేదే ఏర్పరచవచ్చును. కూలి వానిని ఈరీతిగా నిరంతరము పనిలో ఉంచుకోవడమనేది ఇటు కూలివానికి, అటు యజమానికికూడ పర్యవసానంలో మేలే. అయితే ఒకటి:- యజమాని అట్టిసందర్భంలో పెద్ద పెద్ద లాభాలు తీయలేకపోవచ్చు. పెద్ద పెద్ద సాహస లకు దిగలేకపోవచ్చు. జూదాలలో ఓలలాడలేక పోవచ్చు ఇంతే.

సైనికుడు తన నాయకునికొరకై తనప్రాణాలు అర్పిం చడానికి సిద్ధంగా ఉంటున్నాడు; అందువల్ల మామూలు ప వానికంటె, కూలివానికంటె, సైనికులకు దేశంలో గౌరవ ఎక్కువఉన్నది. నిజంగా సైనికునిపని ఇతరులను చంపడ కాదు, ఇతరులకొరకు తాను చావడం! ఇట్టివానిని లోక గౌరవంగా చూస్తోందంటే చూడదామరి! లోకం సైనిక గౌరవంగా చూస్తోందంటే కారణం ఆతడు తన ప్రాణాన్ని దేశసేవకై అంకితంచేసివేశాడు కనుకనే.

అట్లే, న్యాయవాదికి, వైద్యునకు, మతగురువులకుకూ లోకం గౌరవం చూపిస్తున్నారంటే, పర్యవసానంలో దాని

కారణం వారివారి స్వార్థత్యాగగుణమే. న్యాయపీఠ మధిష్ఠించిన న్యాయవాది- దానివల్ల తన కెట్టి ముప్పువచ్చినాసరే సూటిగా న్యాయమే పరిశీలించి చెప్పడానికి శ్రమిస్తాడు. అట్లే వైద్యుడున్ను- ఎట్టి క్లిష్టపరిస్థితి ఏర్పడ్డాసరే-తాను చేపట్టిన రోగికి కష్టించి చికిత్సచేస్తాడు. అట్లే, మతగురువున్ను- సమావేశమైన భక్తులకు బోధించి, వారికి మంచితోవ చూపిస్తాడు.

విద్యావంతులు జ్ఞానవంతులు అని పిలువబడే ఈ పై తరగతులవారిని లోకం - వర్తక వ్యాపారాదులలోతిరిగే వారిని చూచినదానికంటె ఎక్కువ గౌరవంగా చూస్తున్నది. ఎందుకంటే, వ్యాపారస్థుడు *ఎల్లప్పుడూ సొంతలాభం కోసమే చూచుకుంటాడని ప్రతీతి. వ్యాపారస్థుడు చేసే పని సంఘానికి నిజంగా అత్యవసరమైనదే అగుగాక, కాని, ఆపనిని ఆతడు కేవలం స్వార్థంకోసమే చేస్తున్నాడనే లోకం అనుకుంటుంది. వ్యాపారస్థుని ప్రప్రథమదృష్టి తాను వీలైనంత ఎక్కువలాభం గుంజుకొని, వీలైనంత తక్కువప్రయోజనం తనవద్దకువచ్చిన వానికి కలిగించాలని. ఇదీ లోకం సామాన్యంగా అనుకునేమాట. ఇది ఒకవిధంగా వర్తకుని దోషం. కాదు; ప్రభుత్వచట్టాలే ఆతని నీ స్థితిలో ఇరకపెట్టుతున్నవి. ఆతని వృత్తి కిట్టి పనులు అవసరమనికూడ చట్టాలు అంగీకరిస్తున్నవి. ఇలా చెయ్యవలసిందని ఆతనికి లోకం శిఫార్సు చేస్తోందికూడ; లోకులు తాముకూడ ఈ పద్ధతిలో వర్తకునకు ప్రత్యక్షంగానో పరోక్షంగానో సహాకరిస్తున్నారు.

---

* "లాభంలేని సెట్టి వరదలోపోడు" అని తెలుగుసామెత. (అనువాదకుడు)

సమయందొరికితే లోకంఅంతా ఇలాగే చేస్తున్నారు. కొ
క్కునేవాడు ధర చవకకోసం చూడాలనిన్నీ, అమ్మేవా
వాడు మోసంచెయ్యాలనన్నీ, ఇదే విశ్వప్రపంచానికంత
వర్తించవలసిన సూత్రమనికూడ లోకులు ఉద్ఘోషిస్తున్నారి
ఇలా తామే చెప్పుతూ, తామే చేస్తూ, ఆ ప్రకారమే చేస్తున
వర్తకుని లోకులు నిందిస్తున్నారు!! ఇదిపరోక్షంగా తమ్ము
తాము నిందించుకొనడంకాదా? పైగా, వర్తకుని ఈరీతి
తమకు తెలియకనే నిందిస్తూ, అతడేమో మానవలోకంల
నీచతరగతికి చెందినమనిషిగ ఎకాఎకిని అతనిని జమకట్టి వే
న్నారు

ఇలా చేయడం లోకం మానివేసెయ్యాలి. కేవల
సొంతలాభంమీదనే ఆధారపడకుండా ఉండే సత్యమైన వ
పద్ధతి నొకదానిని లోకం కనిపెట్టాలి; లేదా కేవలం సొం
లాభం మీదనే ఆధారపడకుండా ఉండే సత్యమైన వర్త
మనియు, ఇట్టిదితప్ప ఇంకొకటి వర్తకమనే పేరుతో ఉం
జాలదనియు, ఎన్నడూ ఉండలేదనియునైనా లోకం గ్రహి
చాలి. వర్తకమనే పేరుతో ఇప్పుడు లోకులు దేన్నైతే పి
స్తున్నారో, అది నిజంగా వర్తకముకాదనియు పచ్చిమో
మనియు లోకంగ్రహించాలి. నిజమైన వర్తకంలో-నిజమై
యుద్ధంలోవలె - అప్పుడప్పుడు నష్టానికి బుద్ధిపూర్వకము
లోబడవలసివస్తుందనే సంగతిలోకం అంగీకరించాలి. స్వధ
నిర్వహణంలో ఏదోకొంత ధనమేకాక, ప్రాణాలుకూడ పో

ట్టుకోవలసివస్తుంది. అట్లే మతధర్మనిర్వహణంలోకూడ ధన ప్రాణనష్టాలకు గురికావలసివస్తుంది. ఇదేరీతిగా, వర్తకధర్మ నిర్వహణలోకూడ నష్టాలుంటవి అని ఒప్పుకోవాలి యుద్ధంలో వీరత్వంచూపినట్లే, వణిగ్ధర్మయుద్ధంలోకూడ వీరత్వానికి తావు ఉన్నది. క్షాత్రధర్మమెంత వీరత్వమో వణిగ్ధర్మముకూడ అంత వీరత్వమే.

ప్రతి నాగరికజాతిలోను అయిదురకములైన బుద్ధిజీవులుంటారు

(1) సైనికుడు :- (క్షాత్రధర్మము); ఇతనిధర్మము దేశరక్షణ చేయడం.

(2) మతగురువు:-(బ్రాహ్మణధర్మము) ఇతని ధర్మము సత్యము, సద్ధర్మములు బోధించుట.

(3) వైద్యుడు :- దేశమందు శౌచారోగ్యములు కాపాడుట.

(4) న్యాయవాది :- ప్రజలలో ఒకరిమధ్యఒకరికి తగాదాలు న్యాయంగా పరిష్కారం చెయ్యడం.

(5) ఇక అయిదవవాడువర్తకుడు :- లోకులకు కావలసిన సమస్తవస్తుసామగ్రి సమకూర్చిపెట్టడం ఇతని ధర్మం.

వీరందరికి సమంగా వర్తించే సమిష్టిధర్మం ఒకటిఉంది. అదేమంటే, అవసరంవస్తే దేశంకోసం ప్రాణాలు అర్పించడానికి అందరు తయారుగానేఉండాలి. తాను ఎప్పుడు చావాలో తెలిసికోలేనిమనిషి, అసలు తానెట్లు బ్రతకాలోకూడా తెలిసికోలేడన్నమాటే.

ఒకవిషయం అందరూ గమనించాలి. ఏమంటే వర్తకుని యొక్క విధి దేశానికి కావలసిన వస్తుసామాగ్రి సమకూర్చడం, ఈపని చేసినందుకు అతనికి ప్రతిఫలం ఏమిటి? తన తిండికి సరిపడినంత మాత్రమే ఆ వస్తుసముదాయమునుండి తీసుకోవడం తప్ప. అంతకెక్కువగా తీసుకోరాదు. అలాగే మతగురువులకుకూడ; అతని జీవికకు సరిపడ దక్షిణతప్ప ఎక్కువతీసుకోరాదు. ఈ దక్షిణ అనేది అతని బతుకుకు తోడ్పడటానికేతప్ప, తమూం అతని జీవితాదర్శమే కాకూడదు. నిజమైనమతగురువు చూచుకోవలసినది ఇంతమాత్రమే. వైద్యుడు చూచుకోవలసింది ఇంతమాత్రమే. అల్లే వర్తకుడుకూడ లాభమే తన జీవితాదర్శముగాకాక, కేవలం జీవనం వెళ్ళబుచ్చుకోడానికి మాత్రమే; అంతమేరకే ఆ ప్రతిఫలము (లాభము) పొందాలని నిజమైన వర్తకుడు చూడాలి. తమకు ప్రతిఫలం (ఫీజు)ముట్టినా ముట్టకపోయినా ఈముగ్గురు నిజంగావాళ్లైతే (మతగురువు, వైద్యుడు, వర్తకుడు) – విధాయకంగా చేయవలసిన డ్యూటీలున్నవి. ప్రతిఫలంలేకపోగా ఎంతనష్టము వచ్చినాసరే ఆ నష్టానికి ఓర్చుకొనికూడ వారు పనిచెయ్యాలి. మతగురువు డ్యూటీ మతబోధ చెయ్యడం, వైద్యునిడ్యూటీ రోగాలునయం చెయ్యడం, వర్తకునిడ్యూటీ సరుకులుసప్లయిచేయడం. అంటే, తానుసప్లయిచేయదలచిన వస్తువును ప్రశస్తమైన స్థితిలో ఉత్పత్తి చేయించి అది ఎచట అత్యవసరంగా కావాలో అక్కడికి చేర్చి, వీలైనంత చవకధరకు, పంచడానికి వర్తకుడు తన చాకచక్యమును, తెలివితేటలను, శక్తిసామర్థ్యలను వినియోగించాలి అన్నమాట.

(4)

వర్తకుడు నిర్వహించవలసిన విధిలో ఇంకొక ప్రత్యేకత ఉన్నది. అతడు వస్తువులను ఉత్పత్తి చేయవలసిఉన్నాడు కదా. ఇది అతనిఒక్కనివల్ల కాదు, దానికిఎందరో మనుష్యులు కావలసి ఉన్నారు. అందువల్ల వర్తకుడు తనడ్యూటీని నిర్వహించేక్రమంలో, ఆ పేనుందిమనుష్యులకు తాను యజమాని, పరిపాలకుడు అవుతాడు. ఇంకొకవిశేషమేమంటే, వీరికి తనకు మధ్య ఏర్పడే సంబంధం చాలా సన్నిహితంగా నిరంతరంగా ఉంటుంది. ఇంతటి సన్నిహితత్వము మిలిటరీఆఫీసరుకు సైనికులకూ మధ్య కాని, మతప్రచారకునకు భక్తులకుగాని మధ్య ఉండదు. అందువల్ల తనక్రిందిజనముయొక్క యోగక్షేమాలు చూచే బాధ్యత సేనాపతిమీదకంటె, మతప్రచారకునిమీద కంటెకూడ, వర్తకుని మీదనే ఎక్కువ వనూనుగా ఉంటుంది. వర్తకునిడ్యూటీ ఇంకొకరకంగాకూడా క్లిష్టంగాఉంటుంది. సరుకు మంచిదిగాను, చవుకగాను తయారుచేయించడమే కాక, దాని తయారీలో పనిచేసేటటువంటి మనుష్యులకు ఆయా పనులు ఉపయోగకరంగా ఉండేటట్లుకూడా వర్తకుడు చూడాలి

ఈ రెండు విశేషవిధులను నిర్వహించడంలో అవి సక్రమంగా నెరవేరాలంటే, వర్తకుడు తన యావత్తు తెలివితేటలను, చాకచక్యమును, ఓర్పును, శక్తిసామర్థ్యములను, దయాగుణమునుకూడ ఎంతో ఎక్కువగ వినియోగంలోకి తేవాలి. కనుక, అవసరం వచ్చినప్పుడు సైనికుడు, వైద్యుడు తమతమ ప్రాణాలు బలియిచ్చినట్లుగ వర్తకుడుకూడ తన ప్రాణాలు తనవిధులను నెరవేర్చడంలో బలిఇవ్వాలి.

ఈసందర్భంలో, వర్తకుడు రెండువిషయాలు గుర్తులో ఉంచుకోవాలి. అనగ :- తాను సప్లయిచేయవలసిన సరుకును విధిగ సప్లయిచేయడం ఒకటి : ఇక, రెండవది : సప్లయిచేసిన సరుకు స్వచ్ఛమైనదిగా, ప్రశస్తమైనదిగా ఉండటం మరొకటి. ఈరెండువిధులు తాను తప్పిపోవడంకంటె, తనప్రాణాలైనా నిర్భయంగా బలిఇవ్వడానికి వర్తకుడు ఒప్పుకోవాలి. దనాసరి సరుకు ఇచ్చి, అన్యాయమైన విపరీతపుధరగుంజి, నష్టం కష్టం పూడ్చుకోడానికి వర్తకుడు ఏమైనాసరే ఒప్పుకోరాదు. ఎన్ని కష్టాలకైనా, ఎంతదారిద్ర్యానికైనా, ఎంతశ్రమకైనా ఒప్పుకోవచ్చుకాని, ఇట్టి [illegible] వర్తకుడు ఒప్పుకోరాదు.

వర్తకుని డ్యూటీ ఇంకొకటిఉన్నది. అతను తనక్రింద నున్న కూలీలకు నౌకర్లకు అందరికి తండ్రివంటివాడు. అనగ, తండ్రికున్న అధికారంతోపాటు బాధ్యతకూడ ఉన్నదన్న మాట. ఒకచిన్నకుర్రవాడు తనక్రిందికి నౌకరుగా వచ్చాడనుకొందము. సాధారణముగ వాని స్థితిఏమి? ఆకుర్రవాడు తనతలిదండ్రుల ఆదరణాభరితవాతావరణమునుండి వెలువడి బయటికి రావలసివచ్చినవాడేకద. కనుక, ఆకుర్రవానికి ఇక, తండ్రియైనా తల్లియైనా ఆ కంపెనియజమానియైన వర్తకుడే కద. వానికి సదా తోడ్పడడానికి, వానిమంచిచెడ్డలు చూడడానికి, దగ్గరలో ఈ యజమానితప్ప యెవరుంటారు? కనుక, తననౌకర్లకు న్యాయముకలుగచేయడానికి ఆ యజమానికి ఒకటే మార్గమున్నది. ఎట్లంటే, తనకొడుకే–వేరే దిక్కులేక

తన కంపెనీలోనే ఒకనౌకరుగా కుదుర్చుకోవలసివస్తుందనుకోండి. ఈరీతిగా, తనకొడుకే నౌకరుగా వచ్చినప్పుడు, ఆ యజమాని వాని నెట్లా చూస్తాడు? "నాకొడుకే ఈనౌకరుగ వస్తే, నే నెట్లా చూస్తాను" అనే ప్రశ్నను ఈ యజమాని నిర్మొగమాటంగా తనకుతానే వేసుకుంటేసరి. దానికివచ్చే జవాబే దీనికి మార్గము.

ఒక ఓడకెప్టెను తన కొడుకే సామాన్యపు నావికుడుగ ఉండవలసివస్తుందనుకో; అప్పుడు తాను తనకొడుకు నెట్లా చూస్తాడో, మిగతా తనక్రిందినౌకర్లనందరిని అట్లాగే సమానాదరణభావంతో చూచితీరాలి. ఇది అతని విధాయక కృత్యము. అట్లే, ఒకఫ్యాక్టరీయజమాని తనకొడుకునే సామాన్యపు కూలీగా పెట్టవలసివస్తే, అతడు తనకొడుకుతోపాటే, తక్కిన నౌకర్లనందరిని చూచితీరాలి. ఆర్థికసంబంధమైన ఈ అంశముమీద చెప్పదగిన నిజమైన - సమర్థవంతమైన - ఫలవంతమైన - క్రియాత్మకమైన - పరమసూత్రమిదే

సముద్రమధ్యంలో ఓడపగిలిపోతే, దానిని విడిచి పారిపోయేవాళ్ళల్లో ఆఖరువాడుగానే దాని కెప్టెను ఉండితీరాలి. ముందే తాను పారిపోకూడదు. అట్లే, ఓడలో తినుబండారాలు అయిపోయి, ఓడలో జనం మాడిపోవలసివస్తే, ఉన్న రొట్టెలలో అందరూతినగా ఏ కాస్తయినామిగిలితే_ఆ కాస్తే కెప్టెన్ తినాలికాని, ముందుగా తానే మ్రింగికూర్చోరాదు. అదేరీతిగా, వ్యాపారములో క్లిష్టఆర్థికస్థితి వచ్చినప్పుడు ఫ్యాక్టరీయజమాని తనతో పనిచేసే యావన్మందిసిబ్బందితో

సమానముగ తాను ముందుగ బాధపడడానికి సిద్ధమవాలి. అంతేకాదు, తనసిబ్బందిలోని వారికంటె, తానే ఎక్కువ బాధపడడానికి సిద్ధమవాలి తనకంటె వారు ఎక్కువబాధపడే టట్లు చేయరాదు. కరువువచ్చినప్పుడు, నడిసముద్రములో ఓడపగిలిపోయినప్పుడు, లేక, భీషణ సంగ్రామమధ్యలో తన కొడుకును రక్షించుకోడానికి తండ్రి తాను ఆహుతికాడా? నే చెప్పే ఈ మాటలన్నీ వింతగ కనిపించవచ్చు. ఇందులో వింతేమీలేదు వింతవసైనా ఉంటే, ఈమాటలెంత సత్యమైన వనున దొరక్కపోవే వింతలోకెల్ల వింత. ఈసత్యము సర్వకాలసర్వావస్థలకు వర్తించే సత్యము. "ఆహా! ఇదెంత సత్యమైనది. యెంత ఆచరణయోగ్యమైనది" అనియే మనము ఆశ్చర్యపడవలెను. ఇది మినహా తక్కిన సిద్ధాంతాలన్నీ ఆచరణలో అసాధ్యములు. దేశముయొక్క పురోభివృద్ధి సరీతిగా జరగాలన్నా, ఈసత్యముతప్ప ఇంకొకటి ఆచరణయోగ్యముకాదు. నేటి ఆధునికశాస్త్రవేత్తలు లోకానికి ఉపదేశించియుంచిన ఆర్థికసూత్రములయందు గట్టినమ్మకము, పట్టుదలగలవారు ఈసత్యమును తోసిరాజుచేసివేసినారు. ఇప్పుడు లోకమంతా నడిచే జీవితపు నడకయే ఈ తప్పు గాడిలోనడుస్తున్నది. వీటినే కనుక మనము అంగీకరించడం జరిగితే, ఈదోవనే ఇంకా నడిస్తే, మనజాతిఅంతా సరాసరి వినాశనపుగోతిలోకి పోయి పడుతుంది, ఎన్నెన్నిరకాలుగా, ఎట్టెట్టి రీతులుగా ఈ వినాశనం జరుగుతుందో, రాబోయే రెండవ ప్రకరణంలో వివరిస్తాను.

# సర్వోదయము

## ( UNTO THIS LAST )

### రెండవ ప్రకరణము

## ధననాళికలు

గతప్రకరణంలో నేను చెప్పిన సిద్ధాంతములనకు పూర్వపక్షముగ నేటి అర్థికశాస్త్రవేత్తలు చెప్పేది క్లుప్తముగ ఈ దిగువ రీతిగా ఉంటుంది.

"దయ, ప్రేమ అనేవాటివల్ల కొన్నికొన్ని లాభాలు కలుగకపోవు, నిజమే. కాని, అర్థికవేత్తలు అట్టిలాభాల నొక లెక్కగా ఎన్నడూ కైకొనరు. మా శాస్త్రమంతా మనిషి కేవలం ధనవంతుడవటానికే పుట్టింది. మా శాస్త్రము సరి తప్పని శాస్త్రము - అంతేకాక క్రియలో ఇదే మిక్కిలి ఫలవంతమైనదికూడాను. ఈశాస్త్రనియమాలు పాటించేవారు తప్పకుండ ధనవంతులవుతారు; పాటించనివారు తప్పకుండ దరిద్రులవుతారు. యూరపులో ఉన్న ప్రతిధనవంతుడుకూడ ఈ శాస్త్రనియమాలు పాటించినందువల్లనే ధనవంతులైనాడు. ప్రత్యక్షంగా ఇంతసత్యము కండ్లయెదుట కనబడుతూ ఉంటే, అదేదో అసత్యమని చూపించడానికి ఏదో గారడీమాటలు చెప్పితే యేమిప్రయోజనం? వ్యవహారజ్ఞానమున్న ప్రతివాడుకూడ, అనుభవంవల్ల, ఈ సత్యమును తెలిసికొంటు న్నాడు: అంటే డబ్బుసంపాదించేది ఎలాగో, డబ్బుపోగొట్టు కోవడంఎలాగో, వ్యవహారంచేసేప్రతివ్యాపారస్థునికి తెలుసు."

క్షమించండి అయ్యా! - వ్యాపారస్థులు డబ్బుపోగు చేసుకుంటున్నమాటైతే నిజమే. కాని, ఆ పోగుచేసుకోవడ మనేది న్యాయమార్గాల పోగుచేసుకుంటున్నారో లేదో వారు గమనించరు; ఎరుగరు; మరి, తా మిట్లు ధనం తమమట్టుకు కుప్పలుగా పోగుచేసుకోవడంవల్ల, మొత్తం దేశానికి క్షేమం కలుగుతోందో లేదోకూడ వారు ఆలోచించడంలేదు. "ధన" మనే పదానికి, "సంపద" అనేపదానికి అర్థమేమిటో సాధారణంగా వారికి తెలియదు. ఒకవేళ తెలిసియున్నా ఆ పదానికి "పేదరికము", "దారిద్ర్యము" అనేపదాలతో సంబంధమున్న దనిన్నీ వారు అంగీకరించరు.

"ఉత్తరము," దక్షిణము" అనే పదాలు రెండున్నవి కదా. "దక్షిణము" అనేది లేకపోతే "ఉత్తరము" అనే మాటే పుట్టదుకదా. అట్లే "ఉత్తరము" అనేది లేకపోతే "దక్షిణము" అనే పదము పుట్టనే పుట్టదు. ఈ రెండుపదాలు పరస్పర వ్యతిరేకదిశలను చూపించినప్పటికి, ఒకటిలేకుండ ఇంకొకటి ఉండదు. ఒకభావంచెబితే, రెండవభావం చెప్పనక్కరలేకుండ దానిలోనే లీనమై యుంటుంది. రెండూ వేర్వేరుగ విడదీయబడే భావాలు కావు. "ధనము," "దారిద్ర్యము" అనే పదాలుకూడ అట్టివే. ఈ రెంటికి అతుకులేకుండ విడదీసి వేర్వేరు అరలలో పెట్టడానికి వీలులేదు. ఒకడు ధనవంతుడవుతున్నాడంటే, పక్కనెవడో ఇంకొకడు పేదవాడవుతున్నాడనే చెప్పక చెప్పుతుంది. ఈ సూక్ష్మాంశమును గమనించక, "ప్రతిమనిషీ ధనవంతుడై పోవచ్చు"నని ఏవేవో

పన్నాగాలు, ఏవేవో ఆర్థిక సూత్రాలు వ్రాసి వినుపిస్తూఉంటారు. ప్రతిమనిషీ ధనవంతుడెల్లా అవుతాడు, ప్రక్కవానిని పేదవాణ్ణిజేసి కూర్చోపెట్టకపోతే? !! దీనికి "ఎలెక్ట్రిసిటీ" ఉదాహరణచూడండి:- ఎలెక్ట్రిక్ తీగకు రెండుకొనలుంటవి. ఒకకొనయందున్న "పవర్" కంటె, రెండవకొనయందున్న "పవర్" తక్కువగా ఉంటేనే, 'ఎలెక్ట్రిక్' ప్రవాహం ప్రవహిస్తుంది. అదికాక, ఒకటి (ప్లస్), మరొకటి (మైనస్) అయినప్పుడే 'ఎలెక్ట్రిసిటీ' ప్రవహించి పనిచేస్తుంది. ధనశక్తికూడ అటువంటిదే. నీ జేబులో రూపాయిఉండి, ఎదుటివాని జేబులో రూపాయిలేనప్పుడే నీ రూపాయి పని చేస్తుంది. నీ ఎదుటివాని జేబులోకూడ రూపాయియుంటే నీ రూపాయికి మజాఏముంటుంది? ఎదుటివానికి అక్కరలేనప్పుడు నీరూపాయి నీకేమి ఒరిగిస్తుంది? నీ రూపాయియొక్క పవర్ సరిగ్గా ఎదుటివానికిగల ఆ రూపాయి అవసరం మీదాధా రపడి ఉంటుంది కనుక, నీ రూపాయికి పవర్ పుట్టించుకోవా లంటే, ముందుగ, నీ ఎదుటవానిచేతిలో అదిలేకుండ చేసి వెయ్యాలి. అప్పుడే నీ జేబులోని రూపాయికి పవర్ వస్తుంది. అనగా నీవు భాగ్యవంతుడవుకావాలంటే, నీ పొరుగువాణ్ణి సదా పేదరికంలోనే ఉంచే ఉపాయం నీవు ఆలోచించాలి. ఇదీ నేటి అర్థికశాస్త్ర పండితులు చెప్పే సూత్రము.

అర్థశాస్త్రాన్ని రెండు దృష్టులతో చూడవలసి యున్నది.

* (1) ఉపయోగకరము, సౌఖ్యప్రదమునైన వస్తుసము దాయమును ఉత్పత్తిచేయడం, ఉత్పత్తిచేసినదానిని పాడవ కుండ, నష్టమవకుండ, భద్రపరచడం. సక్రమంగా సకాలంలో, సరియైనస్థలములలో సరఫరాచేసి పంపిణీచెయ్యడం- వీటినన్నింటిని గురించి చెప్పే శాస్త్రము నిజమైన అర్థ శాస్త్రము. ఇది దేశప్రజలందరిమేలును దృష్టిలోపెట్టుకొని చెప్పే శాస్త్రము. సకాలములో పంటనునాటి, కోసి, కైలు చేసే రైతు- మంచిపాకంచేసిన అనుసుతో ఇటుకలు అతికి ఇండ్లుకట్టే తాపీమేస్త్రీ, - ఇంట్లో బీరువాలు కుర్చీలు బల్లలు వగైరాసామాను చెడిపోకుండ పరిశుభ్రంగా ఉంచుకునే ఇల్లాలు- తనవంటింట్లో ఆహారపదార్థాలు దుబారాగా పాడుచేసి, పాయపెట్టి, పారవేయకుండా ఉండే గృహిణి,- వీరందరు నిజమైన అర్థశాస్త్రవేత్తలు అని చెప్పాలి. వీరందరు తమదేశానికి, సంఘానికి, అనుక్షణం నూతన సంపదనుచేర్చి అందరి సమిష్టిక్షేమానికి తోడ్పడేవారు. వీరిదే సవ్యమైన అర్థశాస్త్రపద్ధతి - ఇది సమాజానికంతకు మేలుచేసే అర్థ శాస్త్రంకనుక దీనికి "సామాజిక అర్థశాస్త్రము" (పొలిటికల్ ఎకనమిక్సు") అనిపేరు.

(2) ఇదికాక ఇంకొకరకం అర్థశాస్త్రం నేడు అమలులో ఉన్నది. ఇతరులకష్టార్జితమును తాము గుత్తగొని అనుభవించే హక్కు-- చట్టబద్ధమైనహక్కు-- ఏ కొలదిమంది చేతులలోనో

* అర్థపురుషార్థ నిర్వహణం; ధాన్య, భూమి, హిరణ్య, పశు, భాండోపస్కారాదీనాం ఆర్జనం, అర్జితస్య పరిరక్షణం - అర్థః (కౌటిల్య)

చేరిపోవడం ఇదే "వర్తకనీతి" గ ప్రభుత్వశాసనాలుసహా అంగీకరించినవి. వీనికే "వర్తకసరళి అర్థశాస్త్రము" ("మర్కెంటైల్ ఎకనమిక్సు") అని పేరు. ధనమంతా ఒకరి చేతిలోనున్నూ, ఋణం పేదరికం అంతా సరిగ్గా మరొకరిచేతి లోను ఉండిపోవడమే ఈ "మర్కెంటైల్ అర్థశాస్త్రము" చెప్పే నీతి. బాధ్యతలన్నీ ఒకరివి, హక్కులన్నీ మరొకరివి.

"ధన" మంటే నేటినాగరికప్రపంచంలో ఈరెండవ రకమైన వర్తకసరళిఅర్థ శాస్త్రరీత్యా సంపాదించుకొన్నదే అని అర్థము. ఈరకంలో ధనవంతులైనవారి సంపదను భాగ్యమును లెక్కకట్టడంలో లోకం అవలంబించే పద్ధతి ఏదనగా- "వారికున్న భూములు పశువులు అమ్మితే ఎన్నిరూపాయలు వస్తవి." అనేకాని, ఆ రూపాయలతో ఎన్ని భూములు ఎన్నిగుర్రాలుకొనవచ్చున"ని కాదు. (ఇక్కడ ప్రాధాన్యం లోహపుసుద్దలైన రూపాయలకేకాని, వస్తూత్పత్తిచేసే భూములకుకాదు, మనకు సేవచేసే ప్రాణులైన పశువులకున్నుకాదు.

ఒకనికిభూములు, పశువులు వగైరా ఆస్థి యెంతయున్నప్పటికి కాయకష్టంచేసే మనుష్యులమీదకూడ తనకు అధికారంలేకపోతే, ఈ భూములువగైరా సంపదయావత్తు శుద్ధ దండుగ. ఎట్లంటే, అతనికి మంచి సారవంతమైన భూమి బోలెడున్నది; ఆభూమిలో బంగారపు సుద్దలున్నవి; లెక్కలేనన్ని పశువులున్నవి; ఇళ్లు వాకిళ్ళు తోటలు దొడ్లు ధాన్యపుకొట్లు అన్నీ ఉన్నవి. కాని, వానివద్దకు వచ్చి పని చేసే నౌకరు (కూలి) ఒక్కడుకూడ లేడనుకోండి! అప్పు డీ

భూములు బుట్రి ఆతనికేమి ప్రయోజనం! ఎవరైనా కూలీలుగా తనవద్దకు రావాలంటే, చుట్టుపక్కల ఎవరో కొంత మంది పేదవాళ్ళుగ ఉండాలి, తనబంగారం, తనధాన్యం కావాలనుకునేవాళ్ళు ఉండాలి, అట్టి వాళ్లెవరూ లేరనుకో;

అప్పుడు అతనివద్దకు నౌకర్లుగ ఎవరువస్తారు? ఎవరూ రారు. నౌకర్లెవరూ రాకపోతే, ఈ భూములన్నీ, ఈ పశువులన్నీ, ఈబంగారమంతా అతడు ఏమిచెయ్యాలి? ఆతడు తన రొట్టెతానే చేసుకోవాలి: తనబట్ట తానే నేసుకోవాలి, తానే ఉతుక్కోవాలి; తన పొలం తానే నాగలిపట్టుకొని దున్నుకోవాలి; తన పశువులమందను తానే మళ్ళేసుకోవాలి. ఆతని పొలంలో ఉండే పచ్చగులకరాళ్ళ కెంత ప్రయోజనమో, అందుండే బంగారపుసుద్దలకుకూడ ఆతని కంతే ప్రయోజనం. తాను చేర్చిపెట్టుకొన్న ధాన్యమురాసులన్నీ కుళ్ళి పుచ్చిపోవలసిందే - ఎందుకంటే, అవన్నీ తానొక్కడే తినలేడుకద. ఇంకొకడు తిన్నదానికంటె తానెక్కువ తినడానికి వానికి పొట్టపది? ఇంకొకడు కట్టిన దానికంటె, ఎంత ఎక్కువబట్ట తాను కట్టుకోగలడు? మామూలు సౌకర్యాలు పొందడానికికూడ, అతడు బాగా చెమటోడ్చి, కష్టించి, నానాచాకిరీ తనకు తానే చేసుకోవలసివస్తుంది.

ఇట్టిపద్ధతిలో ఇట్టిరకమైన భూములు వగైరా సంపదలు కావాలని ఎవడు కోరుకుంటాడు, వాడెంత పేరాశాపరుడైనా కాని? ఇవ్వి వానికేమి సంతోషాన్నిస్తవి? ఈ బరువులన్నీ నాకెందుకురా బాబు అనుకుంటాడు. కనుక, "ధన"

మనే పేరుతో నిజంగా అందరూ కోరుకునేది ఏది? వెండి బంగారాలు కాదు, తోటిమనుష్యులపై ఆధిపత్యం, అధికారం చెలాయించడం. పొరుగువాడిచే తేరగా చాకిరీచేయించుకోగల గడం. ఒకకూలివాని, లేక, వర్తకుని, లేక, కళాకారుని సేవలను మనం తేరగా పొందేశక్తి. ఇట్టి శక్తి, పొరుగువాని దగ్గర ఎంతతక్కువగ ఉంటే, మనము అంత ఎక్కువ భాగ్యవంతుల మన్నమాట. అట్లే, ఇట్టిశక్తి పొరుగువానిదగ్గర ఎంత ఎక్కువగా ఉంటే, మనము అంత తక్కువ భాగ్యవంతుల మన్నమాట. ఒకానొక వస్తువు సప్లయి పరిమితంగా ఉండి, దానికి తానివ్వగలధరయే ఇవ్వడానికి శక్తిగలవాళ్ళు హెచ్చుమంది తయారుగా ఉంటే, తనభాగ్యం, తన 'పవర్' తగ్గిపోయిందన్నమాట. అట్టి శక్తివంతులు ఎంతహెచ్చుమంది ఉంటే, తన 'పవర్' అంత తగ్గిపోయిందన్నమాట. సంగీత పాటగాడు పేదవాడైతే, మరి, తనచేత పాడించుకుని డబ్బిచ్చేవాడు చుట్టుపట్ల ఒక్కడే ఉంటే, అతడు రూపాయికే పాట పాడిపోతాడు. అట్లుగాక, డబ్బిచ్చిపాడించుకునేవాళ్ళు ముగ్గురు నలుగురుంటే, ఎవడు ఎక్కువడబ్బిస్తె వాడికే పాడుతాడు. కనుక, ధనవంతుడవడమంటే, మనం డబ్బుపోగుచేసుకు కూర్చోవడమనే మామూలుమాట అయిండగ, మనకంటె పొరుగువానికి తక్కువడబ్బు ఉండే ఉపాయాన్ని పన్నడమన్నమాట. మనకంటె హెచ్చుస్థితిలో లేకపోతే వాడు మన

కాలిక్రిందికి వచ్చి మనకెందుకు చాకిరీ చేస్తారు? కనుక, మనకు బాగా ఎక్కువ ఉండాలి, వారికి బాగా తక్కువ ఉండాలి. ఈ తేడా ఎంతహెచ్చుగా ఉండేటట్లు చేయగలిగితే మనభాగ్యమంత హెచ్చుగా ఉంటుందన్నమాట.

"ఇట్టి తేడాలు అసమానతలు అవసరమే, ఉండితీరాలి, అవి లాభదాయకమే" అని అనుకోవడం చాలా అసందర్భమైనమాట వెనుకముందు ఆలోచించకుండా చెప్పినమాట. ఆర్థికవిషయాలలో ప్రజలలో ప్రబలియున్న అనేక భ్రాంతులకు మూలము ఈ ఆలోచనలేనిమాటే. ఈఅసమానతల యొక్క "లాభదాయకత్వం" అనేది రెండు సంగతులమీద ఆధారపడియున్నది. (1) ఈఅసమానతలు ఏఏమార్గముల నవలంబించడంవల్ల కొనిరాబడినవి? (2) ఈఅసమానతలు ఏఏ పనులకై ఉపయోగపరుపబడుతున్నవి? భాగ్యభోగ్యాలలోని అసమానతలు - అక్రమంగా కొనిరాబడినప్పుడు - అసలు అవి కొనిరాబడే మార్గములవల్లనే, దేశానికి తప్పకుండ హాని చేసినవి. మరి, దేశంలోకి కొనిరాబడి, స్థాపనచేయబడే కాలంలోకూడ అవి దేశానికి హానిచేసినవి. ఇక, అవి అక్రమంగా నడిపింపబడుతున్నప్పుడు మరింతహాని చేస్తున్నవని వేరే చెప్పవలెనా? అయితే, భాగ్యభోగ్యములలోని తేడాలు న్యాయముగ స్థాపింపబడినప్పుడు, అవి స్థాపనకాలంలోనూ మేలుచేస్తవి; మరి, విశాలాశయములతో నడిపిస్తే, నడిపింపబడినంతకాలమునుకూడ ఇతోధికమైన మేలునున్నూ చేస్తవి.

దేశంలో ధనప్రిసారము సహజమై, సజీవమైన శరీరం లోని రక్తప్రిసారమును పోలిఉంటుంది. మంచి ఆనందము, ఉత్సాహము కలిగినప్పుడు, లేదా, ఆరోగ్యవంతమైన శరీర పరిశ్రమచేసినప్పుడు, శరీరములోనిరక్తము ఒకరకం వేగంతో ప్రివహిస్తుంది. నిరుత్సాహము, సిగ్గు కలిగినప్పుడు, జ్వరం వచ్చినప్పుడు మరొకరకం వేగంతో ప్రివహిస్తుంది. మంచి ఉష్ణత, జీవకళ, ఇచ్చేరకం పొంగు ఒకటి రక్తంలో ఉంటుంది, చల్లబడి, కుళ్ళి, చావుకళ తెచ్చే రకం పొంగు మరొకటి ఉంటుంది.

శరీరంలో రక్తప్రిసారం ఆగిపోయి, కుళ్ళి, అక్కడక్కడ మురికిగుంటలుగానో, కంతులుగానో యేర్పడితే, యావత్తుశరీరంయొక్క ఆరోగ్యం చెడిపోయినట్లుగానే, ధనమనేదికూడ, సంఘశరీరంలో సక్రమంగా ప్రివహించకుండ ప్రిసారం ఆగిపోయి, అక్కడక్కడ మురికిగుంటలుగానో పెద్ద పెద్దకంతలుగానో, ఏర్పడిపోతే సంఘశరీరసంపదయావత్తు క్షీణించిపోతుంది.

సముద్రిమధ్యంలో ఓడపగిలిపోయి, ఇద్దరునావికులు జనసంచారంలేని ఒకానొక లంకలో ఎట్లోబ్రితికి చేరుకున్నారనుకోండి. అలా, కొన్నేండ్లవరకు వేరేదిక్కులేక, కేవలం తమకాయకష్టవల్లనే జీవించవలసివచ్చిం దనుకోండి.

వారుభయులు ఆరోగ్యవంతులుగ ఉండి ఒకరితో ఒకరు కలహించుకొనకుండ స్నేహభావంకలిగిఉండి చక్కగ కష్టించి పనిచేసుకుంటూఉంటే, వారు తమకు కావలసిన

చక్కని ఇల్లుకట్టుకోగలరు; కొంతభూమి సాగులోకి తెచ్చుకొని, తినుబండారాలు పండించుకోగలరు; ఇక భవిష్యత్తుకు కూడ కొంత సరుకు నిలవచేసుకోగలరు. ఇవన్నీ వారికి నిజమైన ఆస్థిగ, సంపదగ, భాగ్యంగా, ఉంటవి. ఇక, ఈసంపదను సమకూర్చడంలో ఇద్దరు సమానంగా కష్టించి పనిచేసియున్నవాళ్ళనుకుందాము. అప్పుడు ఈసంపదను ఇద్దరు సమానంగా అనుభవించడానికి హక్కుగలిగివుంటారు. ఈసంపదలో వారుభయులు సమాన భాగస్వాములు "ఈ ఆర్జించిన సంపదను జాగ్రత్తగ పరిరక్షించుకోండి. న్యాయముగా పంచుకుని అనుభవించండి" అని వారి ఆర్థికశాస్త్రం (వారి అర్థనీతి) వారికి చెబుతుంది.

ఇట్లా ఉండగా ఉండగా కొంతకాలానికి ఈ ఉమ్మడి వ్యవసాయంమీద వారుభయులలో ఎవడికో ఒకడికి అసంతృప్తి కలుగుతుం దనుకున్నాము. అప్పుడు "అబ్బాయి; మనం ఈ భూమినంతా సమంగా పంచుకుని ఇకనుంచి ఎవరి వ్యవసాయం వాళ్ళము వేర్వేరుగా చేసుకొని బ్రతుకుదాము అని అనుకుంటారనుకోండి. ఈ ఏర్పాటు చేసుకున్న కొన్నాళ్ళకు అందులో ఒకడు జబ్బుపడి సరిగ్గా ఊడ్పులసమయంలోనో, కోతలసమయంలోనో మంచంలోనుంచి లేవలేనిస్థితి వస్తుందనుకోండి. సహజంగా అప్పుడు అతడు ఆ రెండవ వానిని "అబ్బాయి! ఈ పనులు నాకు చేసిపెట్టు" అని అడుగుతాడు.

అప్పుడు ఆ రెండవవాడు న్యాయంగా ఏమనవచ్చు ? "సరే! అలాగే చేసిపెడతాను. నీకోసమని మరికొంత అదనముగాకూడ కష్టపడతాను. అయితే ఇంకొక సమయములో అంతపని నీవు నాకోసం చెయ్యాలిసుమా" అంటాడు. "నీకోసం నీపొలంలో నేను ఎన్నిగంటలు పనిచేస్తానో లెక్క కడతాను. మరి నాకు అవసరము వచ్చినప్పుడు నీకు శక్తి కలిగినప్పుడు నీవుకూడా సరిగ్గా అన్నిగంటలు నాపొలంలో పని చేస్తానని నాకు నీవు వ్రాతమూలకమైన వాగ్దానం బాండు ఇవ్వాలి" అంటాడు. అలా అనవచ్చు. అడగవచ్చు: ఇది న్యాయమే.

ఆ మొదటివాని జబ్బు నయంకాక చాలాకాలం అలాగే ఉంటుందనుకో. కొన్నిసంవత్సరాలదాకా వాడు అశక్తుడై పోయి, రెండవవాని సహాయమును కోరవలసిరావడం, ప్రతిసంవత్సరం పై విధంగానే వాడు బాండు వ్రాసియివ్వడం జరిగిందనుకోండి.

ఇలా కొన్నిఏండ్లుగడచిన అనంతరం, మొదటివాని జబ్బునయమై, బాగాపనిచేయడానికి శక్తివచ్చిందనుకోండి. అప్పుడు ఈ ఇరువురి స్థితులు ఎలా ఉంటవి ?

ఈరాజ్యంలో వారిద్దరే పౌరులున్నారు. కనుక మొత్తం మీద ఈ రాజ్యసంపద (సమాజసంపద) తరిగిపోయిందన్న మాటేగా ! ఏండ్లతరబడి ఈరీతిగా ఇద్దరుపనిచేయడానికి బదులు ఒక్కడే చేయవలసివచ్చింది కనుక మొత్తంఉత్పత్తి

సహజంగా తక్కువగానే ఉంటుంది. మొదటివాడు జబ్బుపడకుండఉంటే వాడెంత సంపద ఉత్పత్తిచేయగలిగేవాడో అంత మేరకు మొత్తం ఉమ్మడిసంపద తరిగిపోయినట్లే కద. అవసరం హెచ్చయినదికనుక, రెండవవాడు తాను మామూలుగాచేయగలిగినదానికంటె,ఎంతో ఎక్కువ ఓపిక తెచ్చుకొని హెచ్చుగపనిచేయవలసివచ్చింది. దీనివల్ల కొసకు ఏమిజరిగింది? తనవంతుపొలంమీద తాను చేయతగ్గపని తగ్గిపోయి తద్వారా తనవంతుపొలంలో ఫలసాయమే తరిగి ఉంటుంది. కనుక ఇద్దరూ ఆరోగ్యవంతులుగాఉండి ఇద్దరూ కష్టించి పని చేసినప్పుడు ఉండే ఉమ్మడి (సామాజిక) సంపదకంటె, ఇప్పుడు స్పష్టంగా, తరిగిపోయింది.

సరే, ఇది ఇట్లుండగ:— వారిరువురిమధ్య పరస్పరం ఉండతగ్గ సంబంధంలోకూడ మార్పువచ్చింది. జబ్బుపడ్డ మనిషి తనచాకిరీని రెండవవానికి ఏండ్లతరబడి తాకట్టుపెట్టుకోవలసిరావడమేకాక, తా నిదివరకు నిల్వచేసుకున్న తిను బండారాలుకూడ జబ్బుకాలంలో తినివేయడంమూలంగా, ఖర్చుచేసుకొని, తనస్టోర్సు ఖాళీచేసుకున్నవాడై నాడు అందువల్ల జబ్బునయమైనతరువాత కూడ మరి కొంతకాలం తన తిండికి రెండవవానిమీద ఆధారపడవలసిన స్థితి యేర్పడినది. దీనికొరకుకూడ అతడు రెండవవానికి తనచాకిరీని మరింత హెచ్చుగ తాకట్టుపెట్టుకోవలసిన్ని వచ్చింది. రెండవవాని ఋణం చెల్లించే "Pay"— చేసే ఉపాయమిదికాక, అతని కింకేమున్నది?

ఈరీతిగా మొదటివాడు దఫాల్‌వారీగా రెండవవానికి వ్రాసియిచ్చిన "బాండు"లన్నీ ఆ రాజ్యపు "లా" ప్రకారం పూరాగా చెలామణికావలసియే వచ్చిందనుకుందాము. ఈ బాండులను ఆధారంచేసుకొని, రెండవవాడు, తెలుసుకుంటే ఇక తానుపనిచేయకుండ, తనకాలంయావత్తు హాయిగా కాలు మీదకాలువేసుకొని కూర్చుని – మొదటివాణ్ణిపిలిచి, "నీవు వ్రాసియిచ్చిన బాండ్లప్రకారం నీవునాకు చాకిరీచెయ్యి; నేనుహాయిగ కూర్చుంటాను. నీ పొలంలో ఇన్నాళ్లూ నేను పనిచేసినదానికేకాక, ఇంతకాలం నీకు తిండిపెట్టినదానికికూడ అదనంగాకూడా నీవు నాకు చాకిరీ చేస్తానని బాండువ్రాసి యివ్వుము" అని కోరవచ్చును. ఎంతకాలం ఇలా చాకిరీ చెయ్యాలి అనేది, ఆ రెండవవాని ఇష్టం; వానిదయ !

మామూలు లోకవ్యవహారదృష్టిలోచూస్తే, ఆతడిట్లు కోరడంలో 'లా' ప్రకారం ఎంతమాత్రం తప్పుకాదు. ఈ ఇరువురిమధ్య సంబంధం ఇట్లింత దూరంసాగి, నడుస్తున్న స్థితిలో ఆ లంకారాజ్యంలోకి ఎవడో పరాయివాడొకడు వచ్చాడనుకోండి. వాడికేమి కనబడుతుంది? ఈ ఇరువురిలో ఒకడు (సత్తశసితిరీత్యా) మహా"భాగ్యవంతుడుగా" నున్న, మరొకడు మహా"దరిద్రుడుగా"నున్న కనబడతాడు. ఇంకొక ఆశ్చర్యకరమైనసంగతి– ఆ కొత్త వాడి కేమి కనిపిస్తుందనగ:– ఒకడు తనకాలంయావత్తు సోమరిపోతుగా గడుపుతూ తేరగా తింటూకూర్చుండడమున్ను, రెండవవాడు కడుపుకట్టుకొని ఏనాటికైనా ఋణవిముక్తుడను కాకపోతానా, అనే దింపుడు

కళ్ళుపులశతో ఉభయులనిమిత్తమై వచ్చేచాకిరీచేస్తూఉండ డమున్నూ - కనిపిస్తుంది. మొదటిదే ఆశ్చర్యంగా కనబడితే, ఈ రెండవది అంతకంటె ఆశ్చర్యంగా ఆ కొత్తవానికి కనిపిస్తుంది.

ఈకథనుబట్టి, ప్రత్యేకంగా గమనించవలసినదని నేను పాఠకులను కోరేదేమనగ:—

ఇతరుల చాకిరీమీద స్వారీచేసే "పెట్టుబడిసంపద"ను పెంపుచేసుకోవడమంటే దేశానికి నిజమైనసంపదను తగ్గించు కోవడమన్నమాట. నిజమైన సంపద అంటే తిండికి, బట్టకు ఇతర జీవితావసరములకు కావలసిన నికరమైన సరుకు అని అర్థం. అనగ ధాన్యములు, వస్త్రములు ఇత్యాదులసంపద అన్నమాట.

ఇంకొక ఉదాహరణ చూడండి. ఇది మామూలు వ్యాపారసరళిలో ఉండేకథే.

వెనుకటి కథలో ఇద్దరొక లంకారాజ్య మేర్పరచు కొన్నారని చెప్పాము. ఇద్దరుకాక యిప్పుడు ముగ్గురిట్టి సముద్రమధ్య లంకలో ప్రజారాజ్యం ఏర్పరచుకొన్నారను కొందము. వారు విడిపోవలసివచ్చి తమతమ వ్యవసాయమును ఒకరికొకరికి అందుబాటుకాని దూరప్రదేశములో సాగించ వలసి వచ్చిందనుకోండి. ఒకడు తనపొలంలో ఒకరకం పంట పండిస్తున్నాడు. మరొకడు తనపొలంలో మరొకరకం పంట పండిస్తున్నాడు. అవి ఎటువంటివంటె, వాడివస్తువు వీడికి కావ

లసివుంది. వీడివస్తువు వాడికి కావలసివుంది. అట్టిపంటలు వాళ్లు పండిస్తున్నారు. వీరిద్దరిచోట్లు దూరదూరంగా వుండటమువల్ల ఒకరివస్తువు ఇంకొకరు మార్చుకోడానికి మాటి మాటికి ఉభయులు తమపనులు వదలిపెట్టుకొని కదలవలసివస్తున్నది. ఇది కాలము, శ్రమము దండుగగ ఉన్నది. కనుక ఈ దండుగలేకుండ చేయడానికిగాను, మూడోవాడేమంటాడంటే "మీ సరుకుల సరఫరా అటూ ఇటూ నేను చూసిపెడుతూ వుంటాను. ఈపని మీకు చేసిపెట్టినందుకుగాను నేను సరఫరా చేసే ప్రతి ధాన్యపుబస్తాలోనుండి ( ప్రతి పార్సెలులోనుండి ) కొంతభాగం నాకు ప్రతిఫలంగా ఇవ్వండి " అని అడుగుతాడు.

ఈ సరుకుల సరఫరా పనిని సక్రమంగా సకాలంలో మూడవవాడు చేసిపెడితే ఆ సేద్యగాండ్ర యిరువురపనులు చక్కగా జరుగుతవి. మొత్తం ఈ ముగ్గురితోకూడిన ప్రజారాజ్యానికి అత్యధికమైనసంపద, అత్యధికమైన వస్తూత్పత్తి కలుగుతుంది.

సరే! ఇక ఈఇరువురి సేద్యగాండ్రమధ్య రవాణావ్యాపారములు - ఈ ట్రావెలింగ్ ఏజంటుద్వారాతప్ప - ఇతరత్రసాధ్యమేకాదనుకోండి. కొంతకాలమట్లు జరుగగా ఈఏజంటు సరుకు సరిగ్గా రవాణాచేయక, తన చేతికి అప్పగింపబడిన సరుకును తనవద్దనే అట్టేపెట్టుకుని ఊరుకుంటాడనుకోండి. అప్పుడు ఆ యిరువురిసేద్యగాండ్రలో ఎవరికో ఒకరికి సరుకు కావలసి వస్తుంది. అప్పుడీ ఏజంటు ఏమి చేస్తాడు? సరుకు జాగ్రత్త

రంగా కావాలనుకున్న సేద్యగానిని నొక్కి వానినుండి వీలైనంత యెక్కువగా ఇతరసరుకును పిండి గుంజుకుంటాడు. ఈ రీతిగా ఇరుకుసమయాలు, అవసరాలు కనిపెట్టి, పొంచియుండి ఆ సేద్యగాండ్రిరువురినుండికూడ, వారు పూచబెట్టుకొన్న సరుకునంతా ఏజెంటు గుంజపారేసి, తనవద్ద గుట్టలుగ పేర్చిపెట్టుకోగలడు. ఇట్లు పోగాపోగా కొన్నాళ్ళకు, మరి కొన్నిరోజులు వచ్చినప్పుడు, ఆ యిద్దరి సేద్యగాండ్ర భూములను తానే కొనివేసి, వారిద్దరిని ఆరోజునుండి యిక తనక్రింద పట్టి కూలీలుగానో, నౌకర్లుగానో చేసివేసుకొనగలడు

ఆధునిక ఆర్థికశాస్త్రసూత్రములప్రకారం ఏర్పడ్డ "వర్తకసంపద" (Commercial wealth) ఇది. దీనిని పరిశీలించిచూస్తే పర్యవసానం తేలేదేమంటే - ఈకథలో, సరుకులు సరఫరాచేసిన ఆ ఏజెంటు (వర్తకుడు) న్యాయమైన ప్రతిఫలంతో సంతృప్తిపడి, సరుకులు సవ్యంగా రవాణాచేసియుంటే, ముగ్గురితోకూడిన ఈప్రజారాజ్యపు మొత్తము సంపద చాలా హెచ్చుగా ఉండేది. అది జరగని కారణంచేత రాజ్యసంపద ఉండవలసిన దానికంటె చాలా తక్కువైపోయినది. ఆ సేద్యగాండ్రిరువురి సేద్యపుపనులు చాలా హీనస్థితిగా కుంటువడిపోయినవి. సరిగ్గా కావలసిన తరుణములో తమకు కావలసిన సరుకులు సప్లయి కాకపోవటం ఒక అనర్థకం అసలు తిండికే ఇబ్బంది పడవలసిన రోజులు నానాటికి హెచ్చుయినకారణంచేత వారికి సందేహదిగులు, నిరుత్సాహం ఏర్పడి [illegible].

ఈ రెండుమూడు కారణాలచేత వాళ్లుపడినకష్టంకూడ ఎక్కువ ఫలవంతం కాకుండాపోయినది. అయితే, వీళ్ళిద్దరూ ఇలా దరిద్రులైనప్పటికీ, మూడవవాడు (వర్తకుడు) బాగు పడ్డాడుకదా: వాడిదగ్గిర సంపద గుట్టలుగా పెరిగిఉందికదా; ఇదిమాత్రం దేశాదాయం పెరిగినట్లుకాదా అని ఎవరైనా అనవచ్చును. కాని, వర్తకుడు న్యాయస్థుడై, నిజాయితీగా ప్రవర్తించియుంటే, తన ధాన్యాగారమునేకాక, మిగతా ఇరువురి ధాన్యాగారములనుకూడా నింపేకానుకద. అప్పుడు ముగ్గురి ధాన్యాగారములసంపదకూడితే, ఆ ఒక్క వర్తకుని ధాన్యాగారసంపదకంటే ఎంతో హెచ్చుగా ఉండేదికద; తద్వారా మొత్తం రాజ్యసంపద హెచ్చయ్యేదికద. వర్తకుడు న్యాయంతప్పి, ఈ అక్రమపద్ధతిగా నడిచినందువల్ల, అతడు దేశాదాయాన్నే తగ్గించివేసినవాడైనాడు.

కనుక, దేశసంపదను హెచ్చించడం, లేక, తగ్గించడం అనే సంగతికాని, — మరి దానిని సక్రమంగా ఉపయోగించుకోవడం, ఉపయోగించకొనకపోవడం అనే సంగతికాని — పర్యవసానంలో కేవలం న్యాయం, ధర్మం, అనేటటువంటి చర్మచక్షువులకుగోచరించని అమూర్తలక్షణాలమీదనే ఆధారపడియున్నది. ఎవరుకాని సంపాదించి కూడబెట్టుకొన్న సంపద యొక్క నిజమైనవిలువ దానికి అంటియున్న నైతికలక్షణమును బట్టి ఉంటుంది.

గణితశాస్త్రంలో ఒక వస్తువుయొక్క పరిమాణమును తెలియపరచడానికి దానికొక అక్షరమును, x, y, z, అనే అక్షరాలను తగిలిస్తారు. ఉదాహరణ :— నావద్ద x 100 రూపాయలు ఉన్నవి అంటా ననుకో. x అంటే ఎంతని?

x = + 100, (ప్లస్ వంగ) కావచ్చు, లేదా, x = −100 (మైనస్ వంబా) కావచ్చు, కనుక, ఇక్కడ x అనేది అనిర్ధారితమైన అంశము: అది + (ప్లస్) కావచ్చును, లేక −(మైనస్) కావచ్చును. అదేరీతిగా, ఒకడు సంపాదించినసంపదయొక్క విలువకూడ అనిర్ధారితమైనదే; ఆవిలువ +ప్లసో. −మైనసో; న్యాయార్జితమో, అన్యాయార్జితమో అనేది పరిశీలనమీాద కాని తేలదు. న్యాయార్జితమైతే ప్లస్ (+), అనగ దేశసంపదకు మరింత చేర్చుతుంది; అన్యాయార్జితమైతే మైనస్ (−), అనగ, దేశసంపదనుండి మరింత తీసివేస్తుంది.

వర్తకసరళిని ఒకనివద్ద ధనం గుట్టలుగ పెరిగిందంటే అది న్యాయంగా కష్టించి ఉత్పత్తివిధానంలో ప్రావీణ్యత చూపించి, సక్రమంగా కూడ బెట్టుకొన్నదయి యుండవచ్చును. లేదా, వినాశకరములు భోగలాలసకు, నిర్దాక్షిణ్యమగుక్రౌర్యమునకు, 'లా' అనేపేరుతో జరిగే తర్కపు గారడీలకు, చిహ్నముగకూడ ఉండవచ్చును.

ఇవన్నీ "నీతియేమిటి ? ధర్మమేమిటి ?" అని ధనాశాపరులు తోసివేసే వట్టి మాటలుమాత్రమేకాదు. భౌతిక దృష్ట్యాచూచినప్పటికి ధనం పెరగడానికికాని, తరగడానికి కాని, ఈ నీతినియమాలే ప్రధానకారణంగాఉంటవి. ధర్మంగా

ఉంటేనే ధనం విలువ పెరుగుతుంది: అధర్మంగాఉంటే ధనం విలువతరుగుతుంది. దానిని పోగుచేసుకునేమార్గం పొడవునా సంపదను పదిరెట్లుగ ఉత్పత్తిచేసుకుంటూనేవచ్చివచ్చి ఒక చోట రాశిగచేరిన సంపద ఒకరకంసంపద: ఇదిమంచిరకం. అట్లుకాక, అది నడచినమార్గంపొడవునా అందరిని విరుగ దొక్కుకుంటూ అందరినీ పదిపదిరెట్లుగ నాశనంచేసు కుంటూ వచ్చివచ్చి ఒకచోటచేరిన సంపద ఒకరకంసంపద; ఇదిచెడుసంపద. ఈ రెంటికీ ఇంత తేడాఉన్నది!

కనుక, "నైతికమూలములతో నిమిత్తలేకుండ, నీతిగా కాని అవినీతిగాకాని – "ఏనకేనోపాయేన"–డబ్బు సంపాదిం చండరా" అని లోకానికి ఉపదేశంచేయవచ్చునని అనుకో వడంకంటె, ఘోర మింకొకటి లేదు. ఇంతవరకు మానవ లోకాన్ని మోసగించి, విభ్రాంతినొందించి, పాపకూపాలలోకి ఈడ్చుకొనిపోయిన నిరర్థక, దుష్ట, దురహంకార, దురాగత భావములలోనికెల్ల ఇది మరీ దురాగతమైనదని నాభావము. "చవకమార్కెట్టులోకొను, ప్రియపుమార్కెట్టులోఅమ్ము" అనే 'వర్తకనీతి' సూత్రం దేశసంపదను పెంపొందించడానికి పనికివచ్చేసూత్రమని నేడొక భావన మానవులలో ఏర్పడి యున్నది. మానవుని మేధస్సుకు ఇంతకంటె లజ్జాకరమైన నీచస్థితి లోకచరిత్రలో ఎచ్చటను, నే నెరిగినంతవరకు, రికా ర్డయియుండలేదు చవకమార్కెట్టులో కొనాలా? సరే, మార్కెట్టును 'చవక' చేసినదేది? ఇల్లుకాలిపోయి దూలా లన్నీ బొగ్గులైతే మార్కెట్టులోబొగ్గుచవకగా దొరుకుతుంది!

భూకంపంవచ్చి గోడలన్నీకూలిపోతే ఇటుకరాళ్ళమీద చెక్కినట్టు 'చవక' అవుతుంది! కనుక, ఇళ్ళుకూలిపోవడం, భూకంపం రావడం దేశానికి లాభదాయకమంటామా? ప్రియపు మార్కెట్టులో అమ్మమంటావా? సరే - అయితే, మార్కెట్టును ప్రియంచేసిన దేది? ఇవ్వాళ్ళ రొట్టెలను నీవు ప్రియంగా అమ్మావు. ఎవరికిఅమ్మావు? ఇంకొకక్షణానికి చచ్చిపోతూ, ఇక రేపటినుండి రొట్టెఅవసరంలేక, తన ఆఖరుదమ్మిడీకూడ పారేస్తున్నవానికా నీవు అమ్మింది? లేక, నీ పొలం రేపు వేలంవేయించి కొనుక్కోబోయే ధనికుడైన సాహుకారుకా? లేక, నీవు డబ్బుదాచుకొనియున్న బ్యాంకును లూటీచేయబోతున్న సిపాయికా? (ఈముగ్గురు ఎంతడబ్బైనా పారేసి రొట్టెకొంటారు! వాళ్ళకేమి దండుగ?) నీవు అమ్మేసరుకు ఎట్టిమనుష్యులకుఅమ్ముతున్నావో నీవు తెలిసికోలేకపోవచ్చు. వాళ్ళు దుర్మార్గులో మంచివాళ్ళో నీకు తెలియకపోవచ్చు. కాని, ఒకసంగతిమాత్రము నీమనస్సుకు నీవు తెలిసికోవచ్చు; ఏమంటే, నీవు చేసిన ఈపని (ఈఅమ్మకం) న్యాయమైనది, మోసమైనది అగునో కాదో నీమనస్సుకు నీవు తెలిసికోగలవు కద. ఈవిషయంలో నీకు కావలసిన దింతే, నీవు తెలిసికోవలసిన అగత్యము ఉన్న దింతే! నీవుచేసినపని కొనుకు లోకంలో సోఫిష్టులకుకాని, చాప్లలకుకాని, దాక్షిణ్యమునుంచ ఉండేట్లు నిమనస్సుకు నీవు స్పష్టంచేసుకుంటే చాలు. నీ విధిని నీవు చేసినట్లే.

డబ్బుయొక్క అసలు మజా అంతా, శోషితమానవుల మీద తాను ఎక్కి అధికారం చెలాయించగలగడంలోనే

ఉంది అని ఇంతవరకు చెప్పినదానివల్ల స్పష్టమవుతున్నది. ఈ 'పవర్' తనకు లేకపోతే, తనకెన్ని మిద్దెలు మేడలు భూములు బుటార్లు ఉన్న నిష్ప్రయోజనమే: ఇక ఈ 'పవర్' ఉన్న మనిషికి ఈ భూములువగైరా ఆస్థులు దాదాపు అనవసరమే. అయితే, తోడిమానవులపై 'పవర్' సంపాదించడానికి, పైన చెప్పిన మార్గములకంటె, సవ్యమైన ఇతరమార్గమొకటి ఉన్నది, అదే నీతిమార్గము. నీతిమార్గావలంబనవల్లవచ్చిన "పవర్"కు టన్నులకొద్ది బంగారుసుద్దలవల్లవచ్చినపవరుకంటె ఎక్కువ నిజమైన విలువ యున్నది. ఒకొక్కప్పుడు చేతినిండా కనబడని బంగారు తోసికొని లాడుచుండవచ్చు. ఆ చేతిని వాడు ఒకసారి విసిరితే, లేక, ఒక్కసారి ఆచేత్తో వాడెవ్వడైనా ముట్టుకుంటే, ఇంతకడు మామూలు బంగారునవరసులు కురిపించిన దానికంటె ఎక్కువ ఘనకార్యాలుసాధించవచ్చును.

ఇంకొకవిశేషం. ధనముయొక్క ప్రయోజనమంతా ఇతరులమీద అధికారిచెలాయించడంలోనే ఉన్నదిగనుక, ఈపని చేయడంలో ధనం తప్పిపోతే ఆ ధనం ఇక ధనమే కాదు అదిచిల్లిగవ్వకు పనికిరాదు. ఈమధ్య మనఇంగ్లండులో జరిగిన కథంతా మాస్త్రీమనుష్యులపైన మనకున్న అధికారమేమంత గొప్పదిగా ఉన్నట్లు కనబడడంలేదు. ఆ బండారం ఇటీవలనే బయటపడిందికదా!

కొసకొక్కమాట. ధనముయొక్క మజా అంతా తోడి మనుష్యులపై పెత్తనం, ఆధిపత్యం చెలాయింపగలగడమే అనుమాట సిద్ధమైనది కనుక, దీనివల్ల ఏమి యేర్పడుచున్నది?

ఎంతెంత గొప్పవాళ్ళమీద, ఎంతెంత హెచ్చుసంఖ్య మనుష్యులమీద, మనము ఆధిపత్యం - పెత్తనం - చెలాయించగలిగితే, మనము అంతంత ఎక్కువధనసంపదల మవుతున్నామన్నమాటయిది. ఆట్టే ఆలోచించిచూస్తే, అసలు "మనుష్యులే" ధనము అని తెలుసుకొనును - బంగారం కాదు, వెండికాదు. ధనముయొక్క నిజమైన నాళాలు ఎర్రగా ఉంటవి. అనగ, మనుష్యుల రక్తనాళాలే ధననాళాలన్న మాట - లోహధాతువులలోనుండేవ పర్వతనాళ్ళు కావు; బంగారుగనులుకావు. మనుష్యుల నెత్తురుకండలే బంగారు ముద్దలు. సర్వోత్తమములైన ధనసంచయముల పరమప్రయోజనమేది? కాంతివంతమైన కన్నులతో, ఆనందభరితమైన హృదయములతో, సంపూర్ణసౌఖ్యవంతమైన జీవనముతోను సదా తొణికిసలాడుచుండు మానవులను తయారుచేయగలగడమే సర్వ ధనసంచయముల పరమప్రయోజనమైయున్నది. ఇట్టి ఆనంద భరితమానవాళిని ఎంత హెచ్చు మందిని తయారుచేయగలిగితే, ధనముయొక్క ప్రయోజనము, సార్ధకత, అంత హెచ్చగునన్నమాట. పరమదయాళుడగు ఏసుక్రీస్తు భక్తురాలనని చెప్పుకొను ఆంగ్లమాత ('ఇంగ్లండు' అను తల్లి) క్రైస్తవేతరులను తనక్రింద బానిసలుగచేసికొని, వారి తలపాగలలో గోల్కొండవజ్రాలు పొదిగి, "ఇదిగో, నే నెంత ధనవంతురాలనో చూడండి, నా నెత్తిన తలపాగాలలోనే వజ్రాలున్నవి చూడండి" అని లోకానికి డాంబికముగ తన గొప్పను చెప్పుకొనుటమాని - ఎన్నటికైనా, క్రైస్తవేతరులతల్లులకున్న సుగుణసంపత్తిని, ధనసంచయమును, సంపాదించుకొని, తన

బిడ్డలను, "ఇరుగో చూడండి, వీరే నా రత్నాలు. వజ్రాలు" (గోల్కొండవజ్రాలుకావు) అని లోకానికి సగర్వముగ ప్రదర్శింపగల మంచిరోజు - శుభోదయము - రాగలదని నేను ఆశించుచు కలలుకంటున్నాను. నాకల నిక్కముగుగాక !

# సర్వోదయము

## (UNTO THIS LAST)

### మూడవ ప్రకరణము

## సర్వత్ర సమమైన న్యాయము

క్రీస్తుపుట్టుకకు కొన్నివందల సంవత్సరాలకు పూర్వం ఒక యూదుమతస్థుడైన వర్తకుడుండేవాడు. ఆ కాలంలో ఎవరూ సంపాదించియుండనంత హెచ్చయిన ధనమును సంపాదించాడట. మంచి వివేకము, చాకచక్యము కూడ కలవాడని ప్రతీతి. అతడు తన ఖాతాపుస్తకాలలో కొన్నికొన్ని సూత్రాలు వ్రాసి పెట్టిపోయినాడట. అవ్వి ఈరోజువరకు మనకు లభ్యమవుతున్నవి. ఇటలీలోని 'వెనీస్' నగర పౌరులందరు ఈసూత్రాలంటే ఎంతో భక్తితో కొలుస్తారు. అందువల్ల, ఆ వృద్ధయూదీయవర్తకుని విగ్రహాన్ని వారు తమ నగరంలో ఒక ప్రముఖ్యమైనచోట స్థాపించుకున్నారు. ఆయన వ్రాసిపెట్టిపోయిన సూత్రాలన్నీ ఈనాటి వ్యాపార పద్ధతులకు భిన్నంగా ఉన్నవనే కారణంచేత, మనవారు ఇటీవల వాటిని చిన్నచూపు చూడడం సాగించారు.

అతనొకచోట వ్రాసియుంచిన సూత్రమిది – "అబద్ధాలాడే నాల్కతో [illegible] సంపాదించడము [illegible] [illegible], [illegible] [illegible] [illegible] [illegible] వెదుకుతున్న [illegible]."

ఇంకొకచోట, ఈభావాన్ని ఇలా చెప్పాడు :—

"దుర్మార్గంచేత సంపాదించినడబ్బు ఎవరికీ ఏమీ మేలుచేయదు ; కాని, సత్యము మానవులను మృత్యువునుండి విముక్తినొందిస్తుంది."

అక్రమమైన యేపద్ధతులచేత ధనంసంపాదించినాసరే, దాని తుదిసారాంశము, దానివల్ల చివరకులభించేఅంతిమఫలితం వినాశనం, మృత్యువుతప్ప వేరొండులేదని ఈ పై రెండు సూత్రాలు ఘోషించి చెప్పుతున్నవి. ఇవి సుప్రసిద్ధమైన సూత్రాలు. ఈసూత్రాలలో "అబద్ధములాడేజిహ్వ" అనే పదాలకుబదులుగ, "అబద్ధాలాడే ప్రకటనలు, అబద్ధాలాడే చీటీలు, (లేబుల్సు) హెడ్డింగులు, నటనలు" అని చదువుకుంటే ఈసూత్రాలు నేటివ్యాపారసరళులకు చక్కగా అతుకుతవి.

వివేకశాలియైన ఈ యూదువర్తకుడు ఇంకొకచోట ఏమన్నాడో వినండి :

"పేదలను ఏడ్పించి ధనంకూడబెట్టుకొన్నవాడు తప్పకుండ తానే దరిద్రుడవుతాడు" – మరింతగట్టిగ ఇంకొకచోట ఇలా అని సూత్రీకరించాడు :

"దిక్కులేనివాళ్లుకదా యని పేదలను దోచుకొనకు ; ఇరుకునపడి నీ అంగడికివచ్చారుకదాయనిచెప్పి వారిని మరింత పీడించకు. ఎందుకంటె, పేదలను నాశనంచేసినవాళ్ళ ఆత్మను భగవంతుడు నాశనంచేస్తాడు."

"పేదవాడుకి దాయని వాణ్ణి దోచుకోవడ" మనేది ముఖ్యంగా నేడు వర్తకవ్యాపారాలలో జరుగుచున్న దుర న్యాయమే. ఇది ఒకరకమైన దొంగతనము, దోపిడీ. ఎదుటి వాని అవసరాన్ని, కక్కుర్తిని, వాటంవారిగా ఉపయోగించుకొని తక్కువరేటుకు వాడి సొత్తును, వాడి చాకిరీని కాజేద్దామనిచూడడమే ఈ దొంగతనము. మామూలు దారిదోపిడీగాడు భాగ్యవంతులను దోచుకుంటాడు, కాని, వర్తకుడు పేదలను దోచుకుంటాడు.

ఇక, అన్నింటికంటె, ప్రఖ్యాతమైన సూత్రాలు ఆ యూదువర్తకుడు వ్రాసిపెట్టినవి మరిరెండు వినండి:

"కలవాడు లేనివాడు కలియబడ్డారు
భగవంతుడే వాళ్ళను సృష్టించాడు;
కలవాడు లేనివాడు కలియబడ్డారు
భగవంతుడే వాళ్ళదీపం"

కం॥ కలవాడు లేనివాడును
కలబడి, రీశ్వరుడె వారిఁ గలిగించెనుగా;
కలవాడు లేనివాడును
కలబడి, రీశ్వరుడె వారి కనువెలు గాగా॥

"The rich and the poor have met
God is their maker;
The rich and the poor have met
God is their light"

"కలియబడ్డారు" అంటే అర్థమేమి? ఒకరితో ఒకరు దెబ్బలాటకు గాని స్త్రీకి కలియబడ్డారన్నమాట. ప్రపంచంలోవున్న వాళ్లు ధనికత్వానికి, పేదరికానికి తగూ (క్రియ, ప్రతిక్రియ) ఉండనే ఉంటుందన్నమాట. ఇదిసృష్టిసూత్రం: నదులనీరు సముద్రపునీరు ఒకటికొకటి ఎదుర్కొని కలియబడడం ఎట్టి సృష్టినియమమో, ఇదీ అంతే. "భగవంతుడే వాళ్ళను సృష్టించాడు" దీనిఅర్థమేమి? దాని వివరణ ఇది:

పేదలకు, భాగ్యవంతులకు మధ్య జరుగుచుండే క్రియ, ప్రతిక్రియ అనే స్పర్ధ, (లోకసంబంధము) న్యాయమైనదీ, ప్రశాంతమైనదీ కావచ్చును; లేక, వినాశకరమైనది, భీభత్సమైనదీ కావచ్చును. ఊళ్ళూ నాళ్ళూ ముంచివేసే బ్రహ్మాండమైన వరద కావచ్చును. లేదా, సస్యానుకూలమైన ప్రశాంత స్రవంతి కావచ్చును. ఈ రెండురకాలలో ఏరకమైనది కావాలో, పేదలు భాగ్యవంతులు తెలుసుకోగలగాలి; తెలుసుకోగలరు. ఎందుకంటె, వారుభయులు భగవంతునినుండి ఉద్భవించిన తునకలేకదు; ఈశ్వరాంశ ఉభయులలోను ఉన్నదికదా. "భగవంతుడే వాళ్ళను సృష్టించాడు" అన్న పదానికిది వివరణ! "భగవంతుడే వాళ్ళకు దీపం"-అంటే, భగవంతుడిచ్చిన జ్ఞానం వాళ్ళల్లో ఉన్నది. కనుక, ఆ జ్ఞానదీపంతో వాళ్ళు ఉభయులు న్యాయమేదో అన్యాయమేదో తెలిసికోవాలన్నమాట.

నదీప్రవాహములతీరు సరిగ్గా ధనప్రవాహమును పోలియున్నది. పల్లమెక్కడో నీరు అక్కడికి చేరుతుంది. అట్లే,

అవసరమైనచోటికే ధనం అక్కడికి చేరాలి. నదీప్రవాహమును తీసుకొని మానవుడు విచక్షణతో మార్చనుకూడా వచ్చును. ఆ నది నీరు దేశానికి వినాశనం కలిగించడమో, లేక వర ప్రసాదికావడమో, మానవుని బుద్ధివిశేషంమీద, మానవుని కృషిమీద ఆధారపడియున్నది. మిగులసారవంతమైన నేల కలిగియూ, అనుకూలమైన వాతావరణమును కలిగియు, ప్రపంచములో అనేకప్రదేశాలు, ఆయా నదుల క్రోధావేశములకు గురియై, పాడుబీడు అయిపోయినవి: అంతేకాదు, రోగా దిష్టములకు గురియైనవి. నదీప్రవాహమును ననుక, సక్రమంగా త్రిప్పి, చక్కని కాలువలగుండా ప్రవహింపచేస్తే, పంటచేలకు నెరవ్వదిగసేసి, మనిషికి పశుపక్ష్యాదులకునుకూడ అన్నంపెట్టి, దాహమునుతీర్చటమేకాక, వాతావరణమునంతా పరిశుభ్ర పరచి, సర్వత్రా ఆయురారోగ్యములనిస్తుంది. సముద్రయాన ప వలద్వారా కావలసినచోట్లకు సరఫరాచేస్తుంది; మనుష్యుల ప్రయాణములనుసుఖకరంచేస్తుంది. అట్లుకాక, దానిని విచ్చల విడిగ వదిలివేసి అక్రమమార్గంగాత్రిప్పితే - ఊళ్ళకూళ్ళ ముంచెత్తి, వాతావరణమునంతామురుగెత్తేటట్లుచేసి, రోగాలు కరువులు తెస్తుంది. ఇదేరీతిగా ధనప్రవాహాన్నికూడ మానవుడు తనబుద్ధివిశేషంచేత మంచిగానూ మళ్ళించవచ్చును, హానికరంగానూ మళ్ళించవచ్చును.

పరివాహానికి అడ్డకట్టలువేసి, కాలువలగుండ నీరు క్రమంగా పరివహింపచేస్తే, అది జీవనప్రదమైన నీరు అవుతుంది. వివేకవంతుల చేతిధనము ఇట్టిది. ఇట్లుకాక, పరివాహాన్ని విచ్చల

విడిగ వదలివేస్తే, దేశాని కంతకు అరిష్టదాయకమైన ప్లేగులు, మహామారీజాడ్యాలు పుట్టుకువస్తవి. విషవృక్షాల వేళ్ళనే పోషించే "మర్రా" అనేపేరుగల నది ఒకటి ఉన్న దట. ఇట్లే వివేకవిహీనునిచేతిధనమూ విషవృక్షాలనే పెంచు తుంది.

ధనప్రవాహాన్ని ఈరీతిగా అడ్డకట్టలువేసి సవ్యమైన బోదెలలో ప్రవహింపజేసే సూత్రాల అవసరమును, నేటి ఆర్థికశాస్త్రపండితులు తమశాస్త్రసూత్రములలో గమనించక పోవడం ఆశ్చర్యంగా ఉన్నది. తమశాస్త్రము "ధనవంతు డెట్లాఅవాలో" చెప్పేశాస్త్రమట! ధనవంతు డవడానికి అనేక సూత్రాలున్నవి. అనేక గారడీలున్నవి. పెద్ద ఎస్టేటుదార్లకు చాటుగా విషంపెట్టి చంపి, వారి ఆస్తిని కాజేయడమనే సూత్రము ప్రపంచచరిత్రలో మధ్యయుగాలలో ఒకప్పు డుండెను. ఇప్పుడో, బజారులలో అమ్మే ఆహారపదార్థాలు కల్తీవిలమ్మి, వర్తకులుయావన్మందిప్రజలకు హానిచేసి, డబ్బు చేసుకోవడం మనం నిత్యంచూస్తున్నాము. ఈ ఉపాయము లన్ని, ఈ సూత్రాలన్నీ, నేడు ఆర్థికశాస్త్రపండితులు నిర్వ చించే ఆర్థిక శాస్త్రసూత్రాలకిందకే వస్తవి. "ధనవంతు డెట్లా అవాలో" చెప్పేశాస్త్రంకిందికే ఇవన్నీవస్తవి.

కనుక, "నాశాస్త్రము మనిషిధనవంతుడయ్యేసూత్రం చెప్పేశాస్త్రము" అని నేటి ఆర్థికపండితు డన్నప్పుడు, ఆ సూత్రి మెట్టిరకముదో కూడా కొంచెం వివరించడం మంచిది. ఆసూత్రము "లా" ప్రకారం చెలామణి అయ్యేది - లేక,

"న్యాయమైనది"-అని రెండుపదాలు సాధారణంగా ఈ పండి తులు ఉపయోగించవచ్చుకాక. అయితే, ఈరెండుపదాలలో కొసకు ఏది నిలవాలని వారి ఉద్దేశ్యం? ఎందుకంటె, రెంటి అర్థము ఒకటే కాకపోవచ్చు. ఒకానొకపని "లా" ప్రకారం చెలామణి అయితే అవవచ్చుకాక, కాని, అది 'న్యాయ'మని చెప్పడానికి ఎంతమాత్రం వీలులేని పరిస్థితులు ఉంటవి కనుక, ఆరెండుపదాలలో "న్యాయమైనది" అనేపదమే మనకు ముఖ్యం. అదే చివరకు నిలిచేది. అదే ప్రధానమైనది - రెండవది ప్రధానం కాకపోవచ్చు. కనుక, శాస్త్రరీత్యా మనం ధనవంతులం కావాలంటే, న్యాయమైనపద్ధతిగానే కావాలి. కనుక, "న్యాయము" అంటేకూడ ఏమిటో ముందుగ తెలుసుకోవాలి. పస్తయిని, గిరాకీను (గిరాకీని) బట్టి బ్రతకడ మనేది చేపలు, ఎలుకలు, తోడేళ్ళు బ్రతికేబ్రతుకు. కాని, మానవులుబ్రతకవలసిన పద్ధతి అదికాదు; మానవులు న్యాయ మైన పద్ధతిగా బ్రతకాలి.

కనుక, (కాయ) కష్టం చేసే వాడికి ఏమి ప్రతిఫలం ఇవ్వాలి? దీనికి సంబంధించిన న్యాయమైన సూత్రాలేమి? ఈ సంగతి మన మిప్పుడు పరిశీలించవలసియున్నది.

మనకోసం ఇప్పుడు ఏమనిషి యెంతకాలం, యెంత కష్టంచేస్తాడో, అంతకాలం, అంతకష్టం, వానికి భవిష్యత్తులో అతనికి అవసరంవచ్చినప్పుడు మనము చేస్తామని వాగ్దా నం చేయడమే, "డబ్బుచెల్లించడమనే" పదానికి అసలు అర్థ మని వెనుకటి ప్రకరణములో మనం తెలుసుకున్నాము. మనకు

చేసిన కష్టంకంటె, అతనికి తక్కువకష్టం చేస్తామని వాగ్దానం చేస్తే, అతనికి మనం తక్కువకూలి (తక్కువప్రతిఫలం) ఇచ్చినట్లే. ఎక్కువకష్టంచేస్తామని వాగ్దానంచేస్తే, ఎక్కువకూలి (ఎక్కువప్రతిఫలం) ఇచ్చినట్లే.

ఇక, మామూలుగ లోకంలో జరుగుతున్న రివాజు ఏమంటే: పనిచెయ్యడానికి ఇద్దరుతయారుగఉండి, పని చేయించుకునే మనిషి ఒక్కడే ఉంటే, ఆ ఇద్దరూ పోటీపడి, "ఒకనికంటె ఒకడు తక్కువకూలీకి చేస్తానంటూ" కూలీని తగ్గించుకుంటారు. తక్కువ కూలీకి సిద్ధపడి పనిచేసినవానికి తక్కువకూలియే చేతికి వస్తుంది. అట్లుకాక, పనిచేయించుకునేవాళ్ళు ఇద్దరుండి, పనిచేయడానికి తయారుగ ఉన్నవాడు ఒక్కడే ఉంటే, ఆఇద్దరూ పోటీపడి కూలిపెంచుతారు. అప్పుడు కూలివానికి అధికమైనకూలి చేతికి వస్తుంది. ఈ రెండు పద్ధతులు అన్యాయమే - అక్రమమే. న్యాయమనేది ఈ రెంటికిమధ్యస్థంగా ఉంటుంది.

ఇక, "వడ్డీ"ని గురించి చూద్దాము.

ఒక గింజనాటితే, దానికి అదనంగా, మరొక గింజగా ఫలమునిస్తుంది. ఈ అదనపుగింజయే మొదటి గింజసంపాదించిన "వడ్డీ"గా ఎంచుకోవచ్చును. మనిషి మొదటగ చేసిన కష్టంకూడ సవ్యంగా నడిపితే ఇట్లే తదుపరినష్టని (అదనపు ఫలమును) సంపాదించుకోవచ్చును. ఒక ఉదాహరణం చూడండి: "ఇవ్వాళ్ళ నీవు నాకు ఒకగంట పనిచేసి పెట్టితే, రేపు కోరినప్పుడు, నేను నీకు ఒక గంటాఅయిదునిమిషాలు పనిచేసి

పెడతాను" - అని వాగ్దానంచేయవచ్చును. ఈ అయిదు నిమిషాల అదనపుపనియే, మొదటిగంట సంపాదించిన "వడ్డీ" అన్నమాట. "ఇవ్వాళ్ళ నీవు నాకు 16 ఔన్సుల రొట్టె ఇస్తే నీవు కోరినప్పుడు నేను నీకు 17 ఔన్సుల రొట్టెఇస్తాను" - అని వాగ్దానం చేయవచ్చును. ఈ హెచ్చు ఒకఔన్సు ఆ మొదటి రొట్టె సంపాదించిన "వడ్డీ" అన్నమాట. ఇట్లే ఎన్నో ఉదాహరణలను చెప్పకోవచ్చును.

ఇద్దరు పనిచెయ్యడానికి సిద్ధమై నావద్దకు వచ్చారు. ఒకడు సగంకూలికే చేస్తానన్నాడు. నేను వాణ్ణేపెట్టుకొంటాను. అప్పుడు జరిగేదేమిటి? నాకు పనిచేసినవాడు అర్ధకూటితోనే మాడడం ఒకఅనర్థం; ఇక, రెండవవాడు అసలే కూడులేక మాడటం, ఇది రెండవఅనర్థం! ఒకవేళ నేను పనిచేయించుకున్నవానికి అర్ధకూలీకాక, పూరాకూలి ఇచ్చినప్పటికీ, రెండవానికి అసలు కూలీయే లేదుగా! అయితే, దీనిలో ఉండే సుగుణమేమంటే, నేను పూరాకూలి ఇచ్చిన కూలివాడైనా కడుపుమాడకుండా పూరా తిండి తింటాడు. తద్వారా, నా డబ్బును నేను న్యాయమైన ఉపయోగంలో పెట్టుకొన్నవాడ నవుతాను. నా మనిషికి నేను న్యాయమైన జీతం ఇస్తే నేను అనవసరముగ - విశేషముగ డబ్బు కూడబెట్టుకోలేను. భోగాలకై డబ్బు దుబారాగా ఖర్చుచేయలేను. లోకంలో ఉండే అపారమైన పేదరికాన్ని మరింత హెచ్చుచెయలేను. నానుండి న్యాయమైన జీతం తీసుకునే మనిషి, తనక్రిందనున్న నౌకర్ల యెడకూడ న్యాయంగానే ప్రవర్తిస్తాడు. అందువల్ల, న్యాయప్రవాహం ఎండి

పోదు; పైగా, పోగాపోగా, అది పెద్దమహానదియే అవుతుంది. ఇట్టి న్యాయతత్పరతతో నడిచే దేశము సౌఖ్యవంతము, భాగ్యవంతము అవుతుంది.

కనుక, "స్పర్ధ", "పోటీ" అనేది దేశానికి "మంచిది" అని మామూలుగ ఆర్థికవేత్తలు చెప్పేమాట సరికాదని తేలుచున్నది. పోటీవల్ల జరిగే దేమంటే, యజమాని కూలి నాని నుండి చాకిరీని - తేరగా - అక్రమముగా చౌకగా తీసుకోడానికి వీలిస్తుందన్నమాట. పోటీవల్ల జరిగేదింతే. మొత్తం ఫలితం ఏమంటే, భాగ్యవంతులు మరింత భాగ్యవంతులవటం, పేద వాళ్ళు మరింత పేదవాళ్ళవటం! తుదకు, మొత్తం దేశమంతా నాశనానికె దోవదీయడం! వాని శక్తిసామర్థ్యాలకు అనుగుణ్యముగ పనివానికి న్యాయమైన కూలి ఇవ్వాలి. దీనిలో కూడ, (అనగా, సామర్థ్యాన్ని పట్టి యిచ్చేకూలిపద్ధతిలో కూడ) ఒకవిధంగా పోటీ ఉండనే ఉంటుంది. ఎట్లంటే, ప్రతి వాడు రెండవవానికంటె హెచ్చుసామర్థ్యాన్ని అలవర్చుకో డానికి ప్రయత్నిస్తాడు అనగ, పోటీ అనేది సామర్థ్యం అలవర్చుకోవడంలో ఉంటుందేకాని, "ఆ పనిని నేను వాడికంటె తక్కువకూలీకి చేస్తానని" అడ్డురావటంలో ఉండదు. హెచ్చు సామర్థ్యసంపాదనకై పడేపోటీలో తగాదాలుండవు. అసంతృప్తి ఉండదు. గవర్నమెంటునౌకరీలలో ఉండే ఆకర్షణకు ఇదే కీలకం. గవర్నమెంటులో జీతాలు ఆయాపోస్టులకు ఇంతింతనిమాత్రమే ఉంటవికాని, ఆ పోస్టుకు వచ్చే మనిషిని బట్టిఉండవు. ఆ పోస్టుకు రాదలచుకున్నవాడు ఆ పోస్టుకు తగిన సామర్థ్యం తనవద్ద ఉందని అంటాడేకాని, ఆ

పోస్టుకు నిర్ణయమైయున్న జీతానికంటె తక్కువజీతానికి
వని అనడు. ఇదీ గవర్నమెంటు నౌకరీలలో ఉండే
స్యము. ఆ పోస్టుకు దరఖాస్తు పెట్టిన రెండవవానికంటె,
కెక్కువ సామర్థ్యం ఉందనే చెబుతాడు. అనగ, సామర్థ్యం
పోటీపడతాడే కాని, రెండవవానిని తోసివేయడానికి త
తక్కువ జీతానికి వస్తానని అనడు. సేనలోను, నౌకా
డిపార్టుమెంటులలోనుకూడ ఇదేపద్ధతి. అక్రమపద్ధ
కిచ్చట తావులేదు. కాని, వర్తకవ్యాపారములలోను, మిల్లు
ఫ్యాక్టరీలు మొదలగు పరిశ్రమలలోను, ప్రాణాంతక
పోటీలు, స్పర్ధలు ఏర్పడియున్నవి. ఈపోటీలవల్ల దగా
దొంగతనాలు, ఇచ్చకాలు, హెచ్చయిపోయినవి. తు
నకంవస్తువులు తయారవుతున్నవి. ఫ్యాక్టరీదారుడు, క
వాడు, కొనేవాడు - అందరూ దగాకే సిద్ధపడుతున్నా
ప్రతివాడు తన స్వార్థంకోసమే చూసుకుంటున్నాడు. ఇ
వల్ల, మానవునకు మానవునకు మధ్యనున్న యీవిస్తృసం
ఘం విషపూరితమైపోతోంది. కూలివాళ్ళు కటువులున
సమ్మెలుచేస్తున్నారు. మిల్లుయజమానులు పచ్చిదొంగ
తున్నారు. కొనుక్కునేవాళ్ళుకూడ తమ నీతివర్తనను ప
చడం మానివేశారు.

ఒకఅన్యాయం లక్ష అన్యాయాలకు దోవతీస్తో
తుదకు కలిగే ఫలితమేమి? యజమాని, కూలివాడు, క
వాడు - అందరూ దుఃఖం, అసంతృప్తి, అనుభవిస్తున్నా
సర్వనాశనం అవుతున్నారు. ప్రజలు సంపాదించుకు

మన్న ధనమే వారి మెడలకు ఉరి త్రాళ్ళవుతున్నవి; వాళ్ళకు శాపాలై కొట్టుతున్నవి.

నేడు చెలామణియగుచున్న ఆర్థికసూత్రాలన్నీ ఒక "శాస్త్ర"మని, మానవులు అసలు అంగీకరించడమే సిగ్గు మాలినపని. లోకచరిత్రలో ఇంతకంటె లజ్జాకరమైనస్థితి మానవుని మేధస్సుకు ఎన్నడూ పట్టలేదు. తాము అవలంబిస్తున్నామని గొప్పగ చెప్పుకునే మతధర్మములయొక్క మూలసిద్ధాంతాలనే ఇంత ఏకరీతిగా ఉల్లంఘిస్తున్న ఏ దేశచరిత్ర సామ్యముకూడ లోకంలో నాకు కనిపించలేదు.

కేవలం ఈశ్వరవాక్యములే అని మనం వాచా చెప్పుకునే మాటలు ఏమని మనకు బోధించి చెప్పుతున్నవి? ధనాశయే సర్వపాపములకు మూలమని అవి చెప్పడంలేదా? ధనమనే విగ్రహాన్ని పూజించడం భగవంతుని పూజించడానికి కేవలం విరోధమైనదని ఘోషించి చెప్పడంలేదా? ధన పూజకు ఈశ్వరపూజకు కేవలం పరస్పరం విరోధమని, - అవి సమన్వయింప వీలులేని అంశాలని చెప్పడంలేదా? కేవలం ధనాన్ని, కేవలం పేదరికాన్ని విడదీసి చెప్పడంలో, ధనం దుఃఖదాయకమని, పేదరికం వరప్రసాదమని కదా ఈ ఈశ్వర వాక్యాలు మనకు చెప్పినవి!

నిజమైన ఆర్థికవిధానము ధర్మము, న్యాయము, అను నది మాత్రమే. తాను సత్ప్రవర్తనుడై, పొరుగువానికి న్యాయం కలుగజేయడంలోనే మానవునకు సౌఖ్యమున్నది.

# సర్వోదయము

## (UNTO THIS LAST)

### నాల్గవ ప్రకరణము

## విలువలు

నేటి అర్థికశాస్త్రము ఏ భావాలను పునాదిచేసికొని నిలిచియున్నదో, అవన్నీ తప్పుత్రోవను తీసికొనిపోయేవే అని గతప్రకరణాలలో చూచియున్నాము. అవి క్రియలోకి వచ్చే టప్పటికి, వ్యక్తిని, దేశాన్నికూడ దుఃఖంలోకే తీసికొని పోతవి. అవి పేదవాళ్ళను మరీ పేదవాళ్ళను చేస్తవి; భాగ్య వంతులను మరీ భాగ్యవంతులనుగా చేస్తవి. కాని సుఖపడు చున్నవాళ్లెవరూ కనిపించరు.

అర్థికపండితులు మానవుల గుణగణాలను లెక్కలోకి తీసికొనరు. డబ్బు గుట్టలుపడడమే సౌభాగ్యమని వారి తలంపు. దేశాలసౌభాగ్యం, దేశాలసౌఖ్యం, అన్నీ పోగు పెట్టుకొన్న ధనరాసులమీదనే ఆధారపడిఉంటవని ఈ పండి తుల అభిప్రాయం! ఎన్నిఫ్యాక్టరీలుంటే, దేశానికి అంత సుఖమంట. వసంతఋతువు ప్రారంభంకాగానే, పల్లెటూరి జనం పల్లెలువదలివేసి, పొలాలువదలివేసి, బస్తీల కేగు చున్నారు. అక్కడ ఫ్యాక్టరీలు వగైరాల మోతలలోను చీకటికోణాలలోను, ఊపిరాడకవచ్చేచోట్లలోను, హీనపు

బ్రతుకు బ్రతుకుతూ ఉంటారు. ఇదంతా మానవజాతి యొక్క దేహారోగ్యమే చెడిపోవడానికి, అంతులేని దురాశ పెరగడానికి, అవినీతిప్రవర్తనకు దోహదం చేస్తున్నది. ఈ కల్మషమంతా పోగొట్టడానికి చర్యతీసుకోవాలని ఎవరైనా అంటే, మన బుద్ధిమంతులేమంటున్నారంటే, "ఇదంతా ఏమీ లాభం లేదండి. ఈ పేదవాళ్ళను విజ్ఞానవంతులను చేద్దామని అనుకోవడం నిష్ప్రయోజనం. ఉన్నస్థితి ఇట్లా ఉండనీయడమే ప్రశస్తమైనపద్ధతి" అని అంటున్నారు. పేదల అవినీతికంతకు అసలు తామే కారకులమనే సంగతిని భాగ్యవంతులు మరచిపోతున్నారు. భాగ్యవంతుల భోగలాలసతల కొరకే కద పేదలు బానిసలుగ పనిచెయ్యడం! మరి, తమ్మునుతాము బాగుచేసుకోడానికి పేదల కొక క్షణంకూడ తమదీ అని చెప్పుకునే విశ్రాంతికూడ లేకపోవడం! భాగ్యవంతులను చూచి నోరూరి, తామును భాగ్యవంతుల మవుదామని పేదలు ప్రయత్నిస్తున్నారు. ఈ ప్రయత్నం విఫలమైనప్పుడు వారికి తగని కోపం ఎగవేసుకు వస్తున్నది. అప్పుడు మతిపోయి, వారుకూడ దగాగానో, దౌర్జన్యంగానో, డబ్బుపోగుచేసుకోడానికి దిగుతున్నారు. ఈరీతిగ ధనికులుచేసేపని, పేదలుచేసేపని కూడ దేశానికి నష్టదండుగ అవుతున్నవి. ఉభయుల ప్రజ్ఞలు పరవంచనకు, కుతర్కములకు పాల్పడుచున్నవి.

ఉపయోగకరములైన వస్తువులను ఉత్పత్తిచేసేదే నిజమైన శ్రమ; నిజమైన కాయకష్టం. లేబర్ అనే పదానికి నిజమైన అర్థమదే. "ఉపయోగకరమైన వస్తువులు" అంటే

మనుష్యులు బ్రతకడానికి ఉపయోగపడే వస్తువులన్నమాట. అనగా, తిండి, బట్ట, ఇల్లు మొదలైనవి. ఇదికాక, ఈజీవితములో మానవుడు సాధించవలసిన సత్కర్మములసాధనలకన్నింటికి ఈశరీరం ఆద్యము, ప్రధానముకద. కనుక. ఈధర్మసాధనలకుఉపయోగపడుచు, ఇతరుల జీవితసాధనలకుకూడతోడ్పడ గలిగే వస్తువులే "ఉపయోగకరమైనవస్తువు" లంటే. భాగ్యవంతుల మవుదామనే ఉద్దేశ్యంతో పెద్దపెద్దఫ్యాక్టరీలు నిర్మించడం మానవులను పాపంలోకి ఈడ్చుకొనిపోవచ్చును. ధనం కూడబెట్టేవాళ్ళు చాలామంది యున్నారు. కాని, దానిని సద్వినియోగం చేసేవాళ్ళు బహుతక్కువ. దేశాన్ని నాశనం చేసే ధనరాసులు, ప్రపంచంలో ఎందుకు పనికివస్తవి? ఇవ్వన్నీ భూదేవికిఅనవసరపు బరువులు. అక్రమమైన, ప్రపంచానంతా చుట్టుముట్టే యుద్ధాలకన్నింటికి నేటిధనికవర్గములే కారకులు. వారి దురాశలే ఈ యుద్ధాలకన్నింటికి అసలు మూలము.

ప్రజలదుస్థితిని బాగుచేయడానికి తగిన విద్య, విజ్ఞానం వారికి కలుగచేయడం సాధ్యంకానిపని యని కొందరంటున్నారు. కనుక, ఎటువాటంగా ఉంటే, ఆ వాటంగానే ప్రవర్తిస్తూ, డబ్బు పోగుచేసుకోవడమే బుద్ధిమంతుల లక్షణమనికొన్ని వీ రంటున్నారు. కాని, ఇది కేవలం అవినీతికరమైన ధోరణి. నీతిసూత్రాలను పాటిస్తూ, దురాశలకులోనుగాక ఉండే సజ్జనుని మనస్సు సుశిక్షితమై ఉంటుంది ; అందువల్ల, సత్పథము నుండి తొలగదు. అంతేకాదు, ఇతరమానవులపై కూడ బాగా మంచిప్రభావం ప్రసరిస్తుంది. వ్యక్తులు అవినీతిపరులైతే

జాతియావత్తు అవినీతిని సాకుంటే ఎట్లుంటుంది? మనము విచ్చలవిడిగా నిగ్రహంలేకుండా తప్పుదోవలలో నడుస్తూ, “నీవు తప్పుచేస్తున్నావేమ”ని మన పొరుగువాణ్ణి సతాయిస్తే ఏమిలాభం? కొసకు మిగిలే ఫలితం వినాశ, నిస్పృహాయే.

కనుక, మనకు తెలిసినసారాంశ మేమంటే. ధన మనేది ఒకసాధన, ఒక ఉపకరణం మాత్రమే. అది మనకు సుఖము నైనా ఇవ్వవచ్చును, లేదా, దుఃఖమునైనా ఇవ్వవచ్చును. మంచివాడిచేతులో ధనం ఉంటే, అది భూమిని సాగుచేసి, మంచిపంట పండించడానికి ఉపకరిస్తుంది. వ్యవసాయదారులు అకృత్రిమమైన సంతృప్తితో పనిచేస్తారు. మొత్తం దేశ మంతా సౌఖ్యవంత మవుతుంది. కాని, దుర్మార్గునిచేతిలో ఉన్న డబ్బు తుపాకి మందుతయారుచెయడానికిన్నీ, దానిని తయారుచేసే మనుష్యులకు, దానివల్ల చచ్చేమనుష్యులకూసహా, ఘోరనాశనం కలిగించడానికిన్నీ మాత్రమే తోడ్పడుతుంది. కనుక జీవితమనేదితప్ప వేరేధనమనేది లేదు. మహోదారమన స్కులు, ఆనందభరితాంతఃకరణులు నైన బిడ్డలను హెచ్చు మందిని ఏదేశం కని, సాకి, పెంచుతుందో, ఆ దేశమే, - ఆ దేశమాతయే ధన్యురాలు. ఆ దేశమాతయే అత్యంత ధనవంతురాలు. ఏ మానవుడు తన స్వజీవితధర్మములను (పురుషార్థములను) సంపూర్తిగ సాధించుకొని, స్థితప్రజ్ఞుడై, ఇతరులను తనసుగుణసంపత్తిచేతను, తనకున్న ఐహికధన సంపత్తిచేతను తనిపి, వారికి పూర్తిగ మార్గదర్శి అవుతాడో అట్టివాడే లోకంలో అత్యంత ధనవంతుడు.

భోగలాలసత కిది కాలంకాదు; ప్రతివాడు శక్తి వంచనలేక కృషిచెయ్యవలసిన విధాయకమున్నది. ఒకమనిషి పనిచేయకుండ సోమరిగా కూర్చుంటే, రెండవవాడు రెట్టింపు పనిచేయవలసిన పరిస్థితివస్తుంది. నేను ఇంగ్లండులోని పేదల దుస్థితికి ఇదే మూలం. "పనులు" అనే పేరుతో కొన్ని నిరుపయోగమైనపనులు ఉన్నవి - ఉదాహరణ :- రత్నాలు సాని మణిపట్టడం. మరికొన్ని, కేవలం వినాశకరమైనవే ఉన్నవి. ఉదాహరణ - యుద్ధప్రక్రియలు. ఇట్టిపనులు దేశాదాయమును తగ్గించివేస్తవి; మరి, ఆ పని చేసే మనిషికికూడ ప్రయోజనకరముగ ఉండవు. మనుష్యులు ఏదో పని చేస్తున్నట్లే కనబడతారు. కాని నిజంగా వారు సోమరులుగానే ఉన్నారు. ధనికులు తమధనాన్ని దుర్వినియోగపరచటం ద్వారా పేదలను పీడిస్తున్నారు. యజమానులు కూలీలు ఒకరినొకరు నరుకోడానికి కత్తులునూరుకొని కూర్చుంటున్నారు. మనుష్యులు కేవలం పశువులై పోతున్నారు.



# సర్వోదయము

## (UNTO THIS LAST)

### గాంధిగారి ఉపసంహారము

రస్కిన్‌గారు ఈ గ్రంథాన్ని ప్రధానంగా తన దేశీయులైన ఇంగ్లీషువారి నుద్దేశించి వ్రాశారు. అయితే, అది మన భారతీయులకుకూడా ఉపకరిస్తుంది. ఇండియాలో ఏవేవో నూతనభావాలు గాలిలో * పుట్టుకు వస్తున్నవి. పాశ్చాత్య విద్య చదువుకొన్న మనకుర్రవాళ్ళు ఏవో ఉద్రేకాలతో నిండియున్నారు. ఈ ఉద్రేకోత్సాహాలను మంచిత్రోవలోకి మళ్ళించాలి. లేకపోతే, వీటివల్ల మనకు హానియే కలుగుతుంది. "మనకు స్వరాజ్యం కావాలి" - ఇదొక కేక - "దేశాన్నంతా యంత్రమయం చెయ్యాలి" - ఇది రెండో కేక. ఈ రెండు కేకలు దేశంలో ఇప్పుడు వినబడుతున్నవి.

అయితే, 'స్వరాజ్య' మని కేకలు వేస్తున్నామేకాని, అసలు దాని అర్థమేమో తెలుసుకున్నవాళ్ళు కనబడడం లేదు. దక్షిణాఫ్రికాఖండంలో నేటాలు దేశం ఉంది. దానికి స్వరాజ్యం ఉంది. ఆ స్వరాజ్యం మనకు దుర్గంధమై కంపు కొడుతోంది. ఎందుకంటే, నేటాలులోని 'స్వరాజ్యం' నీగ్రోలను పీడిస్తున్నది; ఇండియనులను అణచిపెట్టుతున్నది. ఒక

---

* ఇది 1907 నాఁటి : పరిస్థితుల నాటి మాట.

వేళ, ఇండియనులు, నీగ్రోలుకూడ నేటాలుదేశాన్ని విడిచి పెట్టిపోవడమంటూవస్తే, ఇక, అక్కడ నుండే తెల్లవాళ్ళు తమ గొంతుకలు తాము కోసుకొని చస్తారు.

"నేటాలుస్వరాజ్యం వంటిది కాదు, పోనీ, 'ట్రాన్స్‌వాల్' దేశంలో ఉండేమాదిరి స్వరాజ్యం కావాలంటావా?" అక్కడ మాత్రమేమున్నది. ఆ దేశనాయకు డొకాయన "జనరల్‌స్మట్సు" అని ఉన్నాడు. ఆయన చెప్పే దొకటి చేసే దొకటి. ఇప్పుడన్నమాట కాస్సేపటికి తప్పిస్తాడు. ఆయన ఇంగ్లీషుపోలీసులను తీసివేసి, ఆఫ్రికన్‌పోలీసులను పెట్టాడు. ఇది అటు ఇంగ్లీషువారికిగాని, ఆఫ్రికనులకుగాని, కొంచెము మేలు చేస్తుందని నే ననుకోను. లూటీచెయ్యడానికి పరాయివారెవరూ దొరకకపోతే, స్వార్థపరులు తమప్రజలనే లూటీచేస్తారు.

కనుక, ఒక దేశాన్ని సౌఖ్యవంతం చెయ్యాలంటే దానికి స్వరాజ్యం వచ్చినంతమాత్రానచాలదు. ఒక దోపిడి గాండ్రముఠాకు స్వరాజ్యంఇస్తే ఫలితం ఏమిజరుగుతుంది? తాను దోపిడిగాడుకాకుండా ఉండే ఒక సత్పురుషుని అధీనంలో వారుంటేనే, వారందరికీ సౌఖ్యం కలుగుతుంది. అమెరికా, ఇంగ్లండు, ఫ్రాంసుదేశాలు చాలా బలవత్తరమైన రాజ్యాలే; కాని ఇవ్వి నిజంగా సౌఖ్యవంతంగా ఉన్నవని నే ననుకోను.

నిజంగా, స్వరాజ్యమంటే తనను తాను నియమించుకొనుటయే – అనగా, ఆత్మనిగ్రహమే అని అర్థం. ఎవరికి ఈ ఆత్మనిగ్రహశక్తి ఉంటుంది? ఎవరైతే నీతిధర్మములను

పాటిస్తారో, ఎవరైతే సత్యమును తప్పరో, ఎవరైతే లోకులను వంచనచేయరో, ఎవరైతే తమతలిదండ్రులయెడ, తమ దారాపుత్రాదులయెడ, తమనౌకర్లయెడ, ఇరుగుపొరుగువారియెడ, తమవిధ్యుక్తధర్మములను తప్పక నెరవేరుస్తారో, అట్టివారే ఆత్మనిగ్రహశక్తి కలిగియుంటారు. అట్టివాడు తాను ప్రపంచంలో ఎక్కడున్నాసరే, స్వారాజ్యమును అనుభవించుచున్నాడన్నమాటే. ఇటువంటి మంచి లక్షణములుగల పౌరులు హెచ్చుమంది తనదేశంలో కలరని ఏదేశము సగర్వముగా చెప్పుకోగలదో, ఆదేశమే, ఆరాజ్యమే – నిజమైన స్వారాజ్యము ననుభవించుచున్న దేశం కాగలదు.

ఒకదేశస్థులువచ్చి, మరొకదేశంమీద రాజ్యంచేయడం సరికాదు. ఇండియాలో బ్రిటిష్‌పాలన ఉండడం పెద్ద అనర్థకం. అయితే, ఇంగ్లీషువాళ్లు వెళ్ళిపోతే, స్వర్గం చక్కబడుతుందనే భ్రాంతిలో ఎవరూ పడకుందురుగాక.

ఇండియాలో బ్రిటిష్‌పాలన ఉండడానికి కారణం మనలో ఉన్న అనైక్యత, అవినీతి, అజ్ఞానములే. భారతజాతిని పట్టుకొని పీడిస్తున్న ఈ లోపాలన్నీ మనం వదలించుకుంటే, ఒక్క తుపాకికూడ పేల్చనక్కరలేకుండానే, ఇంగ్లీషువాళ్ళు ఇండియా విడిచిపెట్టిపోతారు ; అంతేకాదు, మనం నిజమైన స్వారాజ్యాన్ని అనుభవిస్తూకూడా ఉంటాము.

కొంతమంది వెర్రిబాగుల కుర్రాళ్ళు ఇంగ్లీషువాళ్ళ మీద బాంబులు వేస్తామంటూ ఉబలాటపడుతున్నారు. ఈ ప్రకారంగా ఇంగ్లీషువాళ్ళ నందరిని మనం చంపేశామను

కోండి ; ఇక, అక్కడనుండి, మనలో మనమే చంపుకుంటూ కూర్చుంటాము. ఇటువంటి ఖూనీదార్ల పరిపాలనలోనే దేశం ఉండాల్సివస్తుంది. పురిచేయితీసి, ఎడంచెయ్యి పెట్టమన్న ట్లుగ ఒకళ్ళకు బదులు ఇంకొకళ్ళు యజమానులుకావటం మాత్రమే జరుగుతుంది. అంతకెక్కువ ఫలితం ఏమీ ఉండదు. ఇంగ్లీషువానిమీద వేసినబాంబు,(ఇంగ్లీషువాళ్లు వెళ్ళి పోగానే) మనమీదికే తిరిగి కొట్టుతుంది. ఫ్రెంచిరిపబ్లిక్ ప్రెసిడెంటును చంపినది ఫ్రెంచివాడే ; అమెరికాప్రెసిడెంటు "క్లీవ్‌ల్యాండు"ను చంపినది అమెరికావాడే. కనుక గుడ్డిగా మనం పాశ్చాత్యులను అనుకరించకుందుము కాక.

ఇంగ్లీషువాళ్ళను చంపినందువల్ల స్వరాజ్యం రాదంటే పోని, బ్రహ్మాండమైన పెద్దఫ్యాక్టరీలు నిర్మించుకొనుటవల్ల వస్తుందా అంటే, అట్లాగూ రాదు. బంగారు వెండి గుట్టలు మనం పేర్చిపెట్టుకోవచ్చుగాక ; స్వరాజ్యస్థాపనకది మార్గం చూపించజాలదు. ఈసంగతిని రస్కిన్‌గారు ఖచ్చితంగా ఋజువు పరచియున్నారు. పాశ్చాత్యనాగరికత నిన్నమొన్న పుట్టిన శిశువు. అది పుట్టి 50, లేక నూరు ఏండ్లయినా కాలేదు. అయినా అది యూరపుఖండాన్ని ఎంతోజాలికర మగు హీనస్థితికి దిగదీసింది. ఇట్టి హీనస్థితికి దిగజారిపోయే కర్మ ఇండియాకు పట్టకుండునుగాకయని మనమందరము భగ వంతుని ప్రార్థిద్దాము. యూరపుఖండదేశాలు ఒకరిపై ఒకరు "ఎప్పుడు దూకుదామా" అని సిద్ధంగా కూర్చున్నవి. ప్రస్తుతానికి నిశ్శబ్దంగా ఉన్నయ్యంటే, ఆయుధాలు పేర్చుకోవటం ఇంకా బాగా పూర్తికాలేదన్నమాట. ఉండిఉండి ఎప్పుడో

ఒక్క క్షణంలో కుండ బ్రద్దలౌతుంది. అప్పుడు యూరప్ ఖండం ఖచ్చితంగా భూలోకనరకమే అయికూర్చుంటుంది. ప్రపంచంలో ఉన్న శ్వేతేతరజాతులన్నీ తమకు భగవంతుడు మ్రింగనిచ్చిన కబళములేయని యూరప్‌లోని ప్రతిరాజ్యం భావించుకొంటున్నది. పరుల సంపదలను హరించడమనేదే తమను నడిపించే ప్రధాన ప్రవృత్తిగా మానవుల హృదయాలలో రాజ్యం సాగిస్తున్నచోట్ల, ఇట్టి పరిణామముకాక వేరొకటి ఎట్లు సంభవించగలదు ? ఒక మాంసపుముక్కను చూడ్డగానే కాకు లెట్లు అమాంతంగావచ్చి దానిమీద పడతవో, ప్రపంచంలో ఎక్కడైనాసరే క్రొత్త భూభాగం కంటబడగానే యూరపు ఖండరాజ్యాలు అలా వచ్చి దానిమీద పడతవి. దీనికంతకు కారణం ఆరాజ్యములు నిత్యము తమ ఫ్యాక్టరీలద్వారా తయారుచేసే అధికవస్తూత్పత్తియే యని నాకు తోచుచున్నది.

ఇండియాకు స్వరాజ్యం తప్పకరావలసిందే. కాని అది సధర్మమైన మార్గాలద్వారా రావాలికాని, దుర్మార్గమైన మార్గలద్వారా కాదు. మనది నిజమైన స్వరాజ్యంగా ఉండాలి. అట్టి నిజమైన స్వరాజ్యం హింసాపద్ధతులవల్లకాని, బ్రహ్మాండమైన పరిశ్రమాగారాలవల్లకాని, రానేరదు. ఇండియా ఒకప్పుడు సువర్ణభూమిగా ఉండెను. ఎందుకంటె ఇండియాప్రజలు ఆనాడు సువర్ణమయ హృదయములు కలిగియుండిరి. ఇప్పుడుకూడ అప్పుడున్న భూమియేయున్నది. కాని, నేడది ఎడారియైనది. కారణం, మనం దుష్టులమైనాము కనుకనే. మరల తిరిగి మనభూమి సువర్ణభూమిస్తే

కాగలదు, ఎప్పుడు? నేడు తుచ్ఛలోహముగ ఉన్న మన జాతియొక్క నడత బంగారముగా మార్పుచెందినప్పుడే. "పరుసవేది"యను ఒకానొకరాయి కలదట. అది తుచ్ఛ లోహములను బంగారుగా మార్చివేయగలదట. మనహృదయము లనే తుచ్ఛలోహములను బంగారుగా మార్చివేసే అద్భుతమైన పరుసవేది యొకటి కలదు. దానికి రెండే అక్షరములు గల చిన్న పేరుకలదు. అదే "సత్యమ్". ప్రతిభారతీయుడు సత్యమును తప్పక అంటిపెట్టుకొనియుంటే, స్వరాజ్యం దానంతటది వచ్చిపడుతుంది మనకు.

సమాప్తి.



తెలుగులోనికి అనువదింపబడిన

# గాంధీజీ రచనలు

1. ఢిల్లీ దినచర్య
2. నా మతము
3. మన గ్రామ పునర్నిర్మాణము
4. నూతన విద్యా విధానము
5. అంటు దిస్ లాస్ట్ (సర్వోదయము)
6. సర్వోదయము
7. నవీన విద్యాపథంలో
8. నిర్మాణ కార్యక్రమము
9. పంచాయతీ రాజ్యము
10. సహకార సేద్యము
11. యరోడా జైలునుండి

## అచ్చులోనున్నవి

12. అస్పృశ్యతా నివారణ కార్యకర్తలకు
13. అహింసాత్మక సామ్యవాదము
14. శాంతి సమరములలో అహింసా సిద్ధాంతము
15. ఆశ్రమదీక్షలు, నియమములు

గాంధీ సాహిత్య ప్రచురణాలయము
(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)
రామారావుపేట, కాకినాడ.

## BOOKS BY GANDHIJI

### (IN ENGLISH)

| | | | |
|---|---|---|---|
| Autobiography (Card-board bound) | 3 | 0 | 0 |
| ,, (Paper bound) | [illegible] | [illegible] | [illegible] |
| The Story of My Life | 1 | 8 | 0 |
| Cent Per Cent Swadeshi (*Enlarged Edition*) | 2 | 0 | 0 |
| Constructive Programme — Its Meaning & Place | 0 | 6 | 0 |
| Non-violence in Peace and War — Vol. I | 7 | 8 | 0 |
| Women and Social Injustice | 3 | 0 | 0 |
| Gandhiji's Correspondence with the Government (1942-44) | 2 | 8 | 0 |
| From Yervada Mandir | 0 | 8 | 0 |
| Self-Restraint v. Self-Indulgence | 2 | 0 | 0 |
| India of My Dreams | 2 | 0 | 0 |
| To The Students | 3 | 0 | 0 |
| Mohan Mala | 1 | 0 | 0 |

**NAVJIVAN PUBLISHING HOUSE**

AHMEDABAD